శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ జనార్దనాభ్యుదయము

(కర్లపాలెం క్షేత్ర మాహాత్మ్యము)

*

"కవిరత్న"
బృందావనం లక్ష్మణాచార్యులు

సంపాదన
వేదాల వేంకటప్పలాచార్య
"సాహిత్యరత్న"



*

ప్రచురణ:
శ్రీ జనార్దనస్వామివారి దేవస్థానము
పాలకవర్గము - కర్లపాలెము

రెండవ కూర్పు

1976





ఆంధ్రప్రదేశ్ హిందూ దేవాదాయ, ధర్మాదాయ
శాఖవారి సహకార సౌహార్దములతో

మూల్యము : **6-00**

సూర్యా ప్రెస్ - తెనాలి

ప్రతులకు :—

# గుంటూరు అప్పలాచార్యులు

మేనేజింగ్ ట్రస్టీ - శ్రీ జనార్దనస్వామి దేవస్థానం

కర్లపాలెం, బాపట్ల తా॥ (గుంటూరు జిల్లా)

# మంగళాశాసనము

లక్ష్మణ యతి
ముముక్షుజన మహాపీఠాధిపతి

శ్రీకృష్ణాశ్రమము
పెదముత్తేవి : కృష్ణాజిల్లా.

శ్రీరస్తు : ప్రేమపూర్వక నారాయణ స్మరణములు

పదునెనిమిదవ శతాబ్దికి చెందిన శ్రీమాన్ బృందావనం లక్ష్మణా చార్యులవారి 'జనార్దనాభ్యుదయము' అన్నకావ్యము చదవి ఎంతగనో ఆనందించితిమి. నిర్విరామకార్యక్రమములలో, పర్యటనలో ఉండికూడ, మొదలు పెట్టిన క్షణమునుండి, మరొక ఆలోచనకే తావులేనంతగ అందు మునిగిపోయి, ఒక్క బిగిని పూర్తిచేసితిమి.

కవి ఉద్దండపండితులు, వాన నీటి వైశాల్యమును పోలిన నేటి పాండిత్యముల వంటిదికాక, గురుకుల క్లిష్టమైన విశిష్టపాండిత్యము అక్షరాక్షరమున ప్రతిబింబించుచున్నది.

ఇది ఒక క్షేత్రమాహాత్మ్యము- కర్లపాలెము-గుంటూరుమండలము- అనుక్షేత్రమునందు విజయముచేసి ఉన్న జనార్దనదేవుని వైభవమును వర్ణించు ఈ మహాకావ్యము ఈ జాతికి చెందిన పెక్కు రచనలవలె నీరసముకాక, సరసమై, మాధుర్యగుణశోభితమై అలరారుచున్నది. ఇందలి ప్రతి పద్యమును కవి ప్రతిభావ్యుత్పత్తులకు దర్పణము పట్టుచు చవులూరించుచున్నది.

పేలపిండినే ఆరగించు కొనలేని వారికి మినపకుడుమువలె ఇట్టి మహాకావ్యములు సామాన్య పాఠకలోకమునకు కొంతబరువు అనిపించ వచ్చును. అయినను, చిట్టచివరకు పేలపిండి బ్రతుకులేకాక,

అభ్యాసౌషధసేవచేసి పటుష్టమైన ఇట్టి రచనలను కూడ ఆరగించుకొని, ఆనందించు బలిమి సంపాదించుకొనవలసిన ఆగత్యము సహృదయ పాఠకు లెల్లరిపై ఉన్నది. సర్వులును ఈ అవసరమును గుర్తింతురు గాక అని ఆశించుచున్నాము.

ఇట్టి మహాకావ్యమును ఎన్నోశ్రమలకు ఓర్చి, పరిష్కరించి, వెలుగులోనికి తెచ్చిన ప్రచురణ కర్తలు అభినంద్యులు. గట్టున కూర్చుండి కబురులు ఎన్నియైన చెప్పవచ్చును. కార్యరంగమున అడుగిడినవారి శ్రమ ఇతరులకు అవగతముకాదు— 'నహివంధ్యా విజానాతి గుర్వీం ప్రసవ వేదనామ్'.

ఇట్టి ఉత్తమగ్రంథములకు తగిన ప్రాచుర్యము లభింపవలెనన్న గ్రంథాలయసంస్థలు దేవాదాయ ధర్మాదాయ సంస్థలు పూనుకొనవలసి ఉన్నది. దేవాదాయ ధర్మాదాయ శాఖవారు ఈ గ్రంథ ప్రచురణకు సహాయపడుట ఎంతయో మెచ్చుకొనదగిన విషయము. తత్తదధికారులు ఈ గ్రంథమును, ఇట్టి గ్రంథములను తగిన రీతిలో ప్రోత్సహించెదరు గాక అని ఆశించుచున్నాము.

ఈ మహాకావ్యము ఇంటింటవెలసి, తగిన ఆదరణపొంది ప్రచురణ కర్తల మనోరథములను పండించు గాక అని ఆశించుచు, ఆశీర్వదించుచున్నాము.

కార్తీక బహుళ అష్టమి.
బుధవారం 6—11—75

అనంతనారాయణస్మరణములు
నరరూప నారాయణసేవలో
లక్ష్మణయతి



# అందాల బృందావనము

"కరుణశ్రీ"

## జంధ్యాల పాపయ్య శాస్త్రి

మానసంబు "ప్రసన్న వైఖానసంబు!"
జీవనంబు "ప్రఫుల్ల బృందావనంబు!"
విశ్రమంబు "ప్రశాంత కణ్వాశ్రమంబు!"
"లక్ష్మణాచార్య" "కవిత" సలక్షణంబు ! !

"సదయము" భక్తియుక్త మగు సాధుసమాజము నందు; వాగ్వధూ
"హృదయము" సుప్రసన్నత వహించి రహించుటలో; రసార్ద్రమౌ
"ఉదయము" రాగరంజిత నవోజ్జ్వల దీప్తికి; "శ్రీజనార్దనా
భ్యుదయము" పాతకాళికి ముహుర్ముహు రభ్యుదయమ్ము లిచ్చుతన్ !!

లక్ష్మీవల్లభ కరుణా
లక్ష్మీ సంజాత విజయలక్ష్మీయుతుడౌ
"లక్ష్మణకవీంద్రు" కవితా
లక్ష్మీ విరాజిల్లు మోక్షలక్ష్మికి నెలవై ! !

సాధించుకొన్నారు! సంస్కృతాంధ్రములు, వి
త్తములైన దేశికోత్తముల చెంత;
అందుకొన్నారు! రాజాస్థానముల యందు
సన్మానములు బుధుల్ సన్నుతింప;
పూజించుకొన్నారు! శ్రీజనార్దన పాద
రాజీవయుగ మంతరంగపీఠి;
నింపుకొన్నారు! గుండెల నిండ శ్రీరంగ
శాయి సౌందర్య రసాయనంబు;
ఉక్తి, రక్తియు, శక్తియు, భక్తి కూడి
"కవిత"యై నీదు గంటాన నవతరించె;
ఉదయ మయ్యెను యుష్మదభ్యుదయ మిట్లు
మహిత సాహిత్య సాంద్ర! లక్ష్మణ సుధీంద్ర!

ఆచార్యోత్తమ! యుష్మదీయము విశిష్టాద్వైత పాండిత్య ల
క్ష్మ చాతుర్యము శ్లాఘనీయము విరాజిల్లున్ జగమ్మెల్ల; మీ
ధీచాతుర్యము మాననీయము ప్రవర్తిల్లున్ కళావీథి; మీ
వాచామాధురి వర్ణనీయ మగు విద్వద్రాజ కంఠీరవా!

స్వర్ణదీ సౌవర్ణ వర్ణ పూర్ణాంభోజ
కర్ణిక లన వెల్గు "చూర్ణికలును"
పండువెన్నెల పూలదండ కన్నెల కయి
వండ చిన్నెల దాల్చు "దండకములు"
శిష్టమ్ములై రసాశ్లిష్టమ్ములై జనా
భీష్టమ్ము లగు "సుగంధ్యష్టకములు"
హృద్యమ్ములై యనవద్యమ్ములై సుధీ
వేద్యమ్ము లగు "గద్య పద్యములును"
విందొనర్చెను రసికుల డెందములకు
అందములు చిందు నీదు కావ్యమ్మునందు;
నవ్యకొన్నవి నేడు బృందావనమున
శ్రీ జనార్దన దేవు ఆశీస్సుమాలు !!

పిన్నల్ పెద్దలు మెచ్చ, నీ కృతికి కల్పించెన్ పునర్ముద్రణం;
వెన్నె చక్కని కట్టడమ్ములను కట్టింపించె; కట్టింపగా
నున్నా డెన్నియొ; కార్యశూరు డగు 'గుంటూరప్పలాచార్య' మేల్
'కన్నాకై' 'కవి రత్న' సత్కృతుల 'సంస్కారం' 'బపారంబు'గన్ !

మే లెఱుంగిన సుకవి; వేదాల వేంక
టప్పలాచార్యులు; సమర్థుడైన నటుడు;
"చిత్తు చిత్తైన" పాత్రమ్ము నెత్తి వ్రాసి
కృతికి నూతన ముద్రణాకృతి నొసంగె.

వీర లిరువురి కృషిచేత వెలుగు చూచె
లక్ష్మణాచార్య కావ్య కళా మతల్లి;
కృతికి, కర్తకు, పాఠకతతికి, కృతిస
హాయకుల కిచ్చు శుభము జనార్దనుండు.

సభ్యత "కాటపట్టు"; గుణసంతతి "పెన్నిధి"; నవ్య భావ వా
ల్లభ్యము "పట్టుకొమ్మ"; రస లక్ష్మికి "పుట్టినయిల్లు"; సార సౌ
రభ్యము "వైజయంతి"; అనురక్తికి "క్షేత్రమహత్త్వ" మైన మీ
"అభ్యుదయమ్ము" సర్వ జగదభ్యుదయమ్ములు గూర్చు గావుతన్ ! !



# పెద్దల

## ఆశీస్సులు - ఆమోదములు - ఆకాంక్షలు

ఆంధ్రప్రభుత్వ, ఆస్థానకవి.

కవిసామ్రాట్ : విశ్వనాథ సత్యనారాయణ M.A. గారు.

కీర్తి శేషులు శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్యులుగారు రచించిన 'శ్రీజనార్దనాభ్యుదయము' అన్న మహాగ్రంథమును అందందు పరిశీలించితిని వారు పండితులు - పద్యములు ధారాశుద్ధి గా వ్రాయగలరు-కల్పనలు చక్కగానూ-సమంజసముగానూ-ఉన్నవి. వీరు వైఖానసులు-విష్ణుభక్తులు - భాష్యములు బాగుగా చదివిన వారు-

"వర్ణ"మొక్కటి గాన మా వారు బెంప
పెరిగి "భాష్యాంతరమ్మున" భేద వాది
ద్వైతు లైతిరి-మా పంక్తి దలగు డనుచు
కాకములు నిరసించెను కోకిలముల-

ఈ పద్యములో వసంత ఋతువర్ణనలో చమత్కారముగా "విశిష్టాద్వైతము అద్వైతము" ను సమకూర్చిరి. విశిష్టాద్వైతమే గొప్పదని ధ్వనింప జేసిరి-కాని "భాష్యాంతరమున" అన్న శబ్దము చేత అద్వైతమత మర్యాదను గూడ కాపాడిరి. ఈ కావ్యములో దండకములు వచనములు గూడా గలవు-వచనము కృత్త్యనుప్రాస బహుళముగా పూర్వకవుల రీతినే పయనించినది.

సంస్కృత వాక్యములకు వాక్యములు పద్యములలో నిముడ్చుటలో వీరు చాలా సిద్ధహస్తులు-పంచసంస్కార ప్రాముఖ్యము-సంఖ్యా వాచక త్రిగుణములు గూడా పొందు పరుప బడినవి.

ఈ గ్రంథము కర్లపాలెం క్షేత్ర ప్రాముఖ్యమును వివరించుచూ-వైష్ణవ మత బోధకముగా కవి గారి బహుముఖ పాండిత్యమునకు సూచకముగా నున్నది.— "అతివేంద్రము" "తల్చెద" కాలతీర్పరి-తీర్థబిందె అన్న శబ్దములు శిష్టవ్యవహార స్ఫోరకములు—

ఈ కావ్యము ననుసరించి కర్లపాలెం మహాక్షేత్రము గా నూహింప వచ్చును— కాన ఏతత్ కృతి కర్తలగు శ్రీమాన్ లక్ష్మణాచార్యులు గారు బహుళ ప్రశంసనీయులు

అందు బాటున లేని ఈ కావ్యమున కొక జీర్ణ ప్రతిని సాధించి సమగ్ర రూప కల్పన గావించిన చిరంజీవి వేదాల వేంకటప్పలాచార్యులు శ్లాఘనీయుడు— ఈ చిరంజీవి కింకనూ ఇట్టి మహోత్తమాశయముల నా జనార్దను డనుగ్రహించు గాక—

ఈ మహాకావ్యమును వెలుగు లోనికి కొని వచ్చుచున్న శ్రీజనార్దన స్వామివారి దేవస్థానం మేనేజింగ్ (ట్రష్టీ) గుంటూరు అప్పలాచార్యులు వయసున పిన్న యైననూ మనసున చాలా మిన్నగా కనుపించు చున్నాడు—నాస్తికత ప్రబలి ప్రళయ తాండవ మాడుచున్న యీరోజులలో ఇట్టి మహోత్తమ క్షేత్రమాహాత్మ్యముల వెతికి వెలికిదీసి ప్రకాశింప జేయుటలో ఈతని పరమ ప్రపన్నత్వము భక్తి ప్రపత్తులు స్పష్టముగా గోచరింపుచున్నవి ఇట్టి ఉత్తమ లక్షణములు గల వారికే గదా ! దేవస్థాన పాలనాధికారములు లభింప వలసియున్నది- ఇంకనూ ఈ అప్పలాచార్యులు శ్రీజనార్దనస్వామి

వారి కెన్నియో రకముల కైంకర్యములు చేసెననియూ-చేయుచూ-చేయించు చుండె ననియూ-వింటిని-చాలాసంతోషము ఈచిరంజీవి దైవకార్యములకు సత్కార్యములకు-భక్తులు యితోధికముగా తోడ్పడుదురు గాక-ఈ ఆచార్యు డింకనూ శ్రీఆచార్యుల వారి గ్రంధముల ప్రకాశింప జేయుగాక—

ఈ మహాకార్యమునకు దేవాదాయ ధర్మాదాయ శాఖ వారు గూడా సహాయ పడుట చాలా ముదావహము-వారింకనూ ఇట్టిమహాత్కార్యములకు సహకరింతురు గాక-

కర్లపాలెం క్షేత్ర మాహాత్మ్యమును ప్రచారము చేయుచున్న ఈ మహాకావ్యమును వెలుగు లోనికి కొనివచ్చిన మహాపురుషులకు శ్రీజనార్దన స్వామి దీర్ఘాయు రైశ్వర్యముల ప్రసాదించు గాక- సత్కార్యములు వృధా పోవు గదా ?- భగవంతుడు తప్పక ఫలితమును సమకూర్చి తీరును—

# భావార్చనము

## దర్శనాచార్య - మహోపాధ్యాయ

జమ్ములమడక మాధవరామశర్మ. గుంటూరు

శ్రీ జనార్దనాభ్యుదయ కావ్యము ననుసరించి నే నేమేని సంగతముగా వ్రాయఁదు నని సంకల్పించితిని. నేడు బాపట్లగా మారిన భావపురిపరిసరమున గల కర్లపాలెములో శ్రీజనార్దన దేవుడు అర్చావతార రూపమున వెలసి యున్నాడు. ఆ దేవుని అర్చకాచార్యుడు బృందావనం లక్ష్మణాచార్య పండిత కవి యీ కావ్య కవయిత-అర్చావతారమున అర్చ్యమాను డగు శ్రీదేవుని యథా సంప్రదాయముగ అర్చించు అర్చకు డయిన ఈ కావ్యాచార్యుడు ఇట్లు కావ్యార్చన మొనరించి తానును అర్చనీయు డయినాడు. అర్చ్యార్చన మొన రించు అర్చకు దర్చనీయు డగుట అసాధారణ వైభవము. ఈ నా వ్రాయు టయు నా వాచా ప్రాభవము - అస్తు—

ఈ బృందావన లక్ష్మణుడు అర్చకుడయిన కవి- కవి యయిన అర్చకుడు- దేవాయతనము లాంధ్రమున సహస్రాధికముగా గలవు. అంతట నిట్లు వాణి గల కవులర్చకులు కలరా? ఉన్నచో వారంద రిట్టి భావార్చనము పొందగల కృతుల రచించినచో నందరి హృదయము దేవాయతన మయ్యెడిది. ఇట్టి ప్రేరణము ఆ దేవాయతన దేవులే యొనరింప వలసియున్నది. ఆ దేవీ దేవులకు నేను ప్రేరణ మీ గలనా? నా ప్రార్థనము ప్రేరణము కాగలదో! స్వతంత్ర భారతములో నిది యొక ప్రయోగ వాద మీమాంస-దేవులాటలు మాని యీ విషయమున నంద రుద్యమ సంచాలకులు కావలెను. ఇది కావలయు కార్యము - కాదగు కార్యము—

బృందావన కవి వైఖానస ధర్మవాసితుడు-వైఖానసము వైష్ణవధర్మము లలో నన్యతమము. వైఖానసాగమము మహాత్మ్యాతిశయముకలది. అయినను

పాంచరాత్రా గమము వలె సుప్రఖ్యాతముకాలేదు ఒకప్పు డట్లయి యుండును. కొంతగానది నేటికాలమున లుప్త ప్రాయము. పాంచరాత్ర వైఖానసములలో కొంత భావభేదమున్నది. వైఖానసము కృష్ణయజుర్వేదమునకు సంబంధించి నాలుగు శాఖలలో "ఔఖేయ" శాఖానుసారమున నున్నది.

"యేన వేదార్థ విజ్ఞేయం లోకానుగ్రహ కామ్యయా" ప్రణీతంసూత్ర మేఖేయం తస్మై విఖనసే నమః వానప్రస్థులు కొందరు వైఖానస శాస్త్రాను యాయులు కలరని మను వనెను. వైఖానసేయములు మంత్రసహిత గృహ సూత్రము ధర్మసూత్రము శ్రౌతసూత్రము మరీచి ప్రోక్త వైఖాన సాగమము నేడు కలవు. మరికొన్ని యేవేని వైఖానస సంప్రదాయ పరంపరానమా గతము లుండి యుండును. వానిని లక్ష్మణ బృందావనుడు అధ్యయన మొనరించి యుండును. ఈకృతిలో నట్టిసూచనములు కలవనిన నన్ను విశ్వసించి పాఠకులు పరాక్రమింపవచ్చును. అప్పుడు లుప్తప్రాయము లయిన వైఖానస తత్త్వ రహస్యములను దెలియు గలరు.

వైఖానసాగమములో క్రియాచర్యలు ప్రధానములు-దేవాలయమునకు సంబంధించిన ప్రాకార గోపుర మందిరాంగముల నిర్మాణము-వివిధ దేవ విగ్రహముల రచనము-ఆ యా దేవుల విశిష్టత-ప్రతిష్ట-అర్చనము-మొద లగు నవి ముఖ్యములు - ఆధ్యాత్మికార్థ మల్పమయినను చర్యాక్రమమున భావింప దగు విశేషము లెన్నియో గలవు. ఈ గ్రంధములో నట్టి భావనా విశేషములు కలవు విష్ణు-మహావిష్ణు-సదావిష్ణు-సర్వవ్యాపి రూపమున నాల్గు విధముల నున్న పరమాత్మ భావనము మూర్తి చతుష్టయ భావనములతో నిదాన మగును. విష్ణ్వంశమున పురుషునిలో ధర్మప్రధానత భావనీయము. మహావిష్ణు నంశమున జ్ఞానాత్మక సత్యము ముఖ్యము. సదా విష్ణ్వంశమున అపరిమితైశ్వర్య భావన మున్నది. అది అచ్యుత రూపము. అచ్యుతుడు శ్రీపతి గా భావితుడు. సర్వవ్యాపి యంశమున వైరాగ్య ప్రధానత కలదు.

ఇది అని సిద్ధాత్మకము ఈమూర్తి చతుష్క సముపేతుడయిన శ్రీనారాయణుడు పంచమూర్తి స్వరూపుడు.

మాయా బద్ధు డయిన జీవుడు భగవానుని కృపచే ముక్తు డగును. జీవుడు భగవాను నర్చింప వలెను. జపము, హుతము, ధ్యానము, అర్చనము అను వానిలో ప్రతిమా పూజన మను అర్చనము ప్రధానము. మందిర మధ్యమమున శ్రీదేవీ భూదేవీ సహితుడై విష్ణువు ప్రతిష్ఠితు డగును. దక్షిణ భాగమున పురుష సత్య ప్రతిష్ఠ-వామ భాగమున అచ్యుతానిరుద్ధ ప్రతిష్ఠ, యుండును. పూజ సర్వము వైదికము. జీవుడు సమ్యగారాధనమున "ఆమోదము" అను విష్ణులోకమున సాలోక్యముక్తిని, ప్రమోదమను మహావిష్ణు లోకమున సామీప్య ముక్తిని, సమ్మోదమను సదా మహావిష్ణు లోకమున సారూప్య ముక్తిని, తుదకు వైకుంఠమను సర్వవ్యాపి నారాయణ లోకమున సాయుజ్య ముక్తిని పొందును-జీవుడు శిష్ట దేవతా భిన్నరూపమున సాయుజ్య ముక్తిని పొందు ననుట వైఖానసమున సర్వప్రధానము.

ఇట్టి సూత్రార్థమును భావించి యీ గ్రంథమున భావగాహన మొనరింప దగును. చికీర్షితమును భావించిన లక్ష్మణాచార్యునకు స్వప్నమున విష్ణుదేవుడు సాక్షాత్కరించి కర్తవ్యము సూచించెను స్వప్నానుగతమయిన సూక్ష్మదేహము లోకచతుష్టయము సంచరింప గలదు. అప్పటి భగవదాదేశమే కర్తవ్య నిర్దేశకము మంత్రరత్నార్థ భావనాభావ గరిమాత్మక మయిన యీ కావ్య మావిష్కృత మయినది. ఈ జనార్దనాభ్యుదయ కృతి కొక సముపదిష్ట సంప్రదాయము కలదు. సూతుడు శౌనకాదులకు చెప్పెననుట.

నారదుడు భూలోకమున అడవులు కొండలు గుహలు పుట్టలు తిరిగి "తుంగభద్ర" ఝరి దరికేగెను. అచట ఋషికూటము కలదు. దివ్యాలయము కలదు. వైఖానసాగమ క్రమ విధిజ్ఞు లర్చించిన జనార్దనుడు అచట కలదు. ఏమిటి కందు శ్రీహరి వసించె ? నని సత్యలోకమున బ్రహ్మను నారదు

డడిగెను. బ్రహ్మవివరించెను. నదీ తీరమున ఋషులు సృష్టి స్థితి లయ కారణుని మీమాంస చేసిరి, మూర్తి త్రయము దర్శించి శుద్ధసత్త్వమునను డు వానిని దర్శించిన యాతడే నిర్ణయింప గలడని నిశ్చయించి భృగుమహర్షిని జేరిరి. అడిగిరి-అటుపై భృగువు బ్రహ్మను చూచి శివుని జూచి వారి రాజస తామస భావముల దెలిసి వైకుంఠమున కేగెను. ప్రార్థించి విష్ణువును ప్రత్యక్షముగ దర్శించెను. మ్రొక్కెను. ఉరము పాదమున తన్నెను- తన్ను తిన్న విష్ణువు భృగువును ప్రార్థించి పూజించెను. పిమ్మట భృగువు విష్ణువును ప్రార్థించెను. తిరిగి మునులున్న సరస్వతీ నదీతీరమునకు వచ్చెను. విషయము సర్వము చెప్పెను. విష్ణువే సర్వాధికు డని నిర్ణయించి పలికెను. తాను పశ్చాత్తప్తుడై తప మొనరించెను. అప్పు డశరీరవాణి యిట్లనినది. ఋషి కూటము దగ్గర కణ్వాశ్రమమున యజ్ఞమొనరింపుము, అని శ్రీహరి యిట్లు పాయము సూచించెనని భృగువు నిశ్చయించి యజ్ఞ పరికరములు సంపాదించి వైఖానసాది ఋషులను రప్పించెను. యాగమాచరించెను విష్ణువు సాక్షాత్క రింప లేదని యజ్ఞాగ్ని గుండములో ఆహుతి కా దలంపగా విష్ణువు సాక్షాత్క రించెను. భృగువు స్తుతించెను, నిన్ను అర్చింతును ఇట నీవుండుమని కోరెను. పరము వ్యూహము అంతర్యామి అర్చా స్వరూపములలో నాల్గవ రూపమున నుండు మనెను. విష్ణు వర్చాస్వరూపమున నుండెను. ఆతడే జనార్దనుడు జనార్దన దేవుడే విమానము గర్భగేహము అంతరాళికము ముఖ మండపము తెరసాల గాలిగోపురము ధ్వజస్తంభము యజ్ఞశాల పచనశాల మందిరములు వనములు రథశాల అన్నియు నిర్మించెను- అదివైకుంఠమందిర మయినది. ఇట్టిది జనార్దనాభ్యుదయము-

వేరొక కథా కథనమున వైభవము వర్ణితమయినది. స్వర్ణపుర నివాసి కేశవభట్టు భార్యతో మేనల్లునితో కాశి కేగెను- మేనల్లుడు నందూరు గ్రామము వాడు గోవిందనాముడు వికృతాకారుడు గూనిగోవిందుడు కాశిలో బిందు

మాధవుని ధ్యానించి ప్రార్థించెను- కురూపి నగు నాకు వివాహ మగు నటుల మన్మాతులునకు కుమారికను గలుగ జేయుము-మామకు కూతురు కలిగినను నీ కిచ్చునా, కూతురే పుట్టినచో నిత్తునని కేశవుడు దేవుల సాక్షిగా వలికెను కూతురు పుట్టినది. అంతరంతైనది. కూతురు తల్లి నా పిల్లను గూనిగోవిందునకే కీయనవినది. నీవు కాశికి పోయిరమ్ము ఆ పిమ్మట కర్తవ్య మాలోచింత మని మామ యనెను. గోవిందుడు కాశీయాత్రసాగించెను - మార్గాయాసమున సొకచో విశ్రమించెను బిందుమాధవదేవుడు కన్పడి కాశికి దీసికొని పోయెను అచ్చట గోవిందుడు దీనుడై ప్రార్థించెను. శ్రీవరుడు కాన్పించి నీ వెంట వత్తును. వెనుదిరిగితి పేని యాగెద ననెను. గోవిందుడు గోష్ఠీవనమున కేగెను. సంశయము కలుగగా వెనుజూచెను. దేవు డచటనే యుండెను- కదలలేదు. ఇందుండి సాక్ష్యమిత్తునని నాడు. మామకు సర్వము చెప్పెను. అందరు వచ్చి నమస్కరించిరి. దేవుడు గోవిందునకు కన్య నిమ్మనెను. గూనిగోవిందు నకు సుందర రూప మిచ్చెను- గూని పోయినది. వివాహ మయినది- సర్వము సమాప్తము -

కణ్వాశ్రమము "కర్మపాలె" మయినది. గంగ తుంగ యయినది జనార్దన దర్శన సేవన ఫలమును బ్రహ్మ నారదునకు జెప్పెను సూతుడు శౌనకాదులకు జెప్పెను. బృందావన లక్ష్మణార్చకుడు పాఠకులకు జెప్పెను ఇది యిట్లని ఇట నేను చెప్పితినో! ఇంకను కొంత చెప్పవలసియున్నది -

ఆముక్తమాల్యద నెట్లు చదివినారు! ఎల్లో చదువగా నది కతిపయ పాఠకులకు పీచు పనసపాక మయిన దట- కవితా దృష్టి పురుషార్థ దృష్టి అను దృష్టిద్వయము సంగతపరముకొని యిట్టి వానిని జదువ వలెను. ఈ లక్ష్మణ కవి వైష్ణవ ధర్మవేది-వైఖానస మర్మవేది యజ్ఞ కర్మవేది- విఖనస మతానుసారముగా కర్షణాది ప్రతిష్ఠాంత క్రియా ప్రయోగము ప్రతిష్ఠాద్యుత్సవాంత విధానము ఉత్సవాది నిత్యార్చన పర్యంతశోభ తెలిసిన

కవి దీని రచించెను. ఇది తెలిసి మేము పఠించితిమి అనవలెను. నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ వర్షోత్సవముల గుర్తింపవలెను —

పంచసంస్కారులై యర్థపంచకమ్ము పంచమోపాయ నిష్ఠ సాధించి మించి పంచకాల ప్రపన్నులై పంచపంచ పంచాతత్త్వాశయుని సాధించి మనుడు మూటిని మూటి నెఱిగి యిరుమూటిని పామీటి యవల మూటికి తానే మేటియు నై మూటను తుదమాట దెలిపినదే లోకమాన్యు ధలంతున్-

పరుడు పరముడు పరగతి పరము పద్మము
పరకరుండను పరమాత్మ పరమయోగి
పరుల రక్షించు పరశక్తి పరమభక్తి
పరుల కగువాని కపచార పరులు నరులె ?

ఇట్టి పద్యము లిందుకొన్ని వైఖానస ధర్మ రహస్య నిరూపకములు గలవు ఆరహస్య మెరిగిన వారిని ఎఱిగి యెఱిగి ఈమంత్రార్థము గుర్తింప దగును ఇందు దండక మొకటి 68-72 కలదు. అది రామదండకము కృష్ణదండకము భాగవత దండకము రామాయణ దండకము యోగ దండకము ప్రపన్న దండకము వైఖానస దండకము ఇది బృందావనాచార్య దండకము సర్వ గ్రంథార్థ ధ్యేయము దీనిలో నున్నది. జనార్దన దేవ ప్రదక్షిణ మొనరించు వారు దీని పఠింప వలెను. ఇందింకను పది సంస్కృత శ్లోకములున్నవి. హృద్యములగు నీపద్యములు సుగంధి వృత్తములు విచిత్ర శబ్దగతములు వీని పఠనము జనార్దనున కిష్టము లక్ష్మణున కిష్టము మాధ్వున కిష్టము పాఠకున కిష్టము ఇష్టానుసంధాన మభీష్టము —

లక్ష్మణాచార్య కవి నా యీ భావార్చనము నభినందించుట కీనాడు లేడు. నే నాడు లేను. ఆత్మ వంశీయ బృందావనాచార్యునకు నన్నభినందించుట నలవరచెనో ? నన్ను నేనే అభినందించు కొందును. సమ్మానించు కొందును ఇది లక్ష్మణ సమ్మాన మగును. ఓ లక్ష్మణాచార్య స్వామీ మీరు సమ్మాన

పండిత, జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రి
"సాహిత్యరత్న"
తాలూకా జూనియర్ కళాశాల, తెనాలి.

"అప్యేకం దేవపద మధీయాత" దేవపదము- వేదపదము- నొక్క- దాని నైనను అధ్యయన మొనరించి స్మరించి తరింపవలయు నని శ్రుతి యభిప్రాయము-అట్టి దేవపదములతో, దేవతా కథా గాన మొనర్చి పరమాత్మ సామీప్య సారూప్యాదులను పొందిన భక్త కవివతంసు లెందరో గలరు- ఈ "జనార్దనాభ్యుదయ" కృతికర్త యగు శ్రీమాన్ బృందావనం లక్ష్మణా చార్యులు గారు తాదృశ భక్త కవి శ్రేణికి చెందిన వారు—

వీరు రెండు శతాబ్దములకు పూర్వమున కర్లపాలెం గ్రామములో నివసించి యున్నట్లు తెలియు చున్నది- 'తుంగభద్రా ఝరీ' తటమున విరా జిల్లు చున్న యా గ్రామమున కధిష్ఠాన దైవము శ్రీజనార్దనస్వామి-శ్రీరంగ ధాముడు శ్రీమాన్ ఆచార్యుల వారికి ఇష్టదైవము-స్వప్నమున దర్శన మిచ్చి జనార్దన స్వామి చరితమును రచించి తన కంకిత మిమ్మని యాదేశించుట చే నీ కావ్యమును రచించి శ్రీరంగధామున కంకితము చేసిరి. శ్రీమాన్ ఆచార్యుల వారు శ్రీజనార్దన పాదార విందార్చనా నిరతు లగుట జేసి క్షేత్ర మాహాత్మ్యముగ ఈ కృతిని రచించిరి-

ఈ రచన ప్రాచీన ప్రబంధ శైలిలో సాగినది-"శివేతరక్షతి" సద్యః పర నిర్వృతి" కావ్య ప్రయోజనములుగ ప్రాచీనాలంకారికులు భావించిరి. ఈ కావ్యము అట్టి ప్రయోజనములను చక్కగ సంతరించు కొనిన భక్తిరస పూర్ణమగు కావ్యము-ఇందు విష్ణు పారమ్యము చక్కగ నిరూపింప బడినది. నగర శైలర్తు వర్ణనములతో నొప్పారుచు, లలిత మధురములగు శబ్దా లంకార- అర్థాలంకారములతో- హృద్యముగ సాగిన రచన యిది. మంచి

భావనా పటిమ, కల్పనా శక్తి యిందు పదపదమున గన్పట్టును-వసంత ర్తు వర్ణనము, వర్షర్తు వర్ణనము లందు కల్పనా చాతురి, ఉత్ప్రేక్షించిన రీతి పఠితులను ముగ్ధుల నొనర్చునట్టివిగా యున్నవి. లలిత లలితము లగు తేట తెలుగు శబ్దములతో పద్యము నెంతరమ్యముగ నడిపింప గలరో సంస్కృత సమాసముల తో నంత సరసముగను, హృదయ హారిగను, నుండునట్లు రచనను వెలయింప జేసిన సిద్ధహస్తులు వీరు దండకమును రచించు పట్ల, మూర్తికా రచనా సమయమున, భక్తి పారవశ్యముతో కవి గారి లేఖిని, పరవళ్లుత్రొక్కినది. వీరి కవితా చక్కని ధారాశుద్ధి తో నొప్పారుచు పఠితల మానసములను భక్తి ప్రవణముల నొనర్చు ననుటలో నతిశయోక్తి లేదు. ఎడ నెడ వ్యావహారిక ప్రయోగము లున్నను ఆ యా ప్రసంగము లందు శ్రవణ సుభగములుగనే గన్పట్టును. శ్రీమాన్ ఆచార్యులు గారు వేద పదములతో శ్రీజనార్దనదేవ పదములను ధ్యానించి సార్థక నామధేయులైరి.

ఈ గ్రంధము క్రిమిదష్టమై యొక మూలపడి యున్నది. దీనిని పరిష్కరింప జేసి వెలుగులోనికి తేవవలయునని పూనుకొనిన శ్రీమాన్ గుంటూరు అప్పలాచార్యుల గారు ప్రశంసాపాత్రులు-వీరు ఆస్తికులు ఉత్సాహవంతులు నైన యువకులు-శ్రీజనార్దన దేవస్థాన నిర్వాహణ భారమును వహించి దేవాలయ పునరుద్ధరణాది కార్యములను సమర్థవంతముగ నిర్వహించుటయే గాక యీ దేవదేవుని చరితమును వెలుగు లోనికి తెచ్చి లోకోపకార మొనర్చిరి. ఆ జనార్ధనుని యనుగ్రహము లభించు గాక యని మనసా యాకాంక్షించు చున్నాను-

ఈ కృతిని పరిష్కరించి వెలుగు లోనికి తెచ్చుటలో సహాయపడిన వారు శ్రీమాన్ వేదాల వేంకట అప్పలాచార్యులుగారు-పరిష్కరించుట యనిన సామాన్యము కాదు. పరిష్కర్త కవి హృదయము నెరిగి ప్రవర్తించ వలసి యుండెను. పదములను పూరించుటయేగాక కొన్ని యెడల పాదపూరణము

గూడ చేయ వలసి వచ్చినది. ఆ యా సందర్భములలో మిత్రులు శ్రీమాన్ ఆచార్యులుగారు తమ కర్తవ్యమును సమర్థవంతముగ నిర్వహించిరి. మా వేదాల వారు సంస్కృతాంధ్ర హిందీ భాషల యందు పాండిత్యమును సంపాదించు కొనిన వారు. సంస్కృతాంధ్రములలో చిత్ర కవిత్వ-బంధ కవిత్వాదులను-నిర్వహించుటయే గాక పెక్కు-నాటకములను రచించిన గడుసరి. ప్రశంసా యోగ్యముగ పరిష్కర్తృత్వ భారమును చేపట్టి యా జనార్దన దేవానుగ్రహమునకు పాత్రులైనారు. ఇది మా మిత్ర మండలికి సంమోధావహము.

'అప్యేకం దేవపదమధీయాత'



పౌరాణిక విశారద, పండిత, భాషాప్రవీణ-

చావలి వామనమూర్తి శాస్త్రి

తాలూకా జూనియర్ కళాశాల, తెనాలి.

శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్యులు గారిచే రచింపబడిన శ్రీజనార్దనాభ్యుదయ మను గ్రంథమును, పునర్ముద్రణ గావించు తరి మా సోదరోపాధ్యాయులు హిందీ పండితులు శ్రీమాన్ వేదాల వేంకటప్పలాచార్యుల గారి ద్వారా ఆమూలాగ్రమును చూచు నదవ కాశము కల్గినది.

స్థాలీ పులాక న్యాయమున యా యా ఘట్ట విశేషముల యందలి ప్రతిభా ప్రభాతి శయ విభాసకములగు సందర్భ విశేషములను చూచితిని-సంతోషము కల్గినది.

కవిత నిర్దుష్టమై పూర్వకవుల పురాణ రచనా వైశిష్ట్యమును బుర డించు చున్నది-

శ్లో॥ కవే రల్పాపి వాగ్వృత్తిః విద్వత్కర్ణావతంసతీ
నాయకో యది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః

అన్నట్లు ఉత్తమనాయకుని వర్ణనము అందు భగవత్కథా రచన-సర్వలోక శ్రేయోదాయకము కాఁగలదు-

పుణ్యక్షేత్ర మహిమాది వర్ణనము చే 'పురాణచరిత్రను' నిష్కల్మష ముగను సహజ సద్భక్తి సద్భావనా యుతముగను, ప్రజా సందోహ జీవిత పథమును అసమాన పవిత్ర పూరిత తేజోమయ ధార్మిక బద్ధముగఁ జేయ గల రీతితో శ్రీజనార్దనాభ్యుదయగ్రంథ రచన గావించిన శ్రీమాన్ లక్ష్మణా చార్యులగారు విద్వల్లోకమున అత్యంత శ్లాఘనీయులు, ధన్యజీవులు - అయినారు.

ఈ పవిత్ర గ్రంథము పురాణ శ్రవణ రూపమున సకృచ్ఛ్రవణ మాత్రముచే అఖండానందము కలుగజేయు ననుట నిస్సందేహము—

ఏనాడో శిథిలమై మరుగుపడియున్న ఇట్టి పవిత్ర చరిత్రాత్మక మగు సద్గ్రంథమును వెలికితీసి అధికారులు సహృదయుల ప్రాపుగాంచి వ్యయ ప్రయాసల కోర్చి పునర్ముద్రణ గావించి పాఠకలోకమున కందఁజేసిన కర్లపాలెము వాస్తవ్యులు శ్రీమాన్ గుంటూరు అప్పలాచార్యుల గారి కృషి ప్రశంసా పాత్రము—

శ్రీ జనార్దనస్వామి సర్వథా సర్వదా సర్వులకు శుభములు చేకూర్చు గాక యని—నా ప్రార్థన—

★

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం, M.A., Ph.D.,
గుంటూరు.

భరతఖండమే యొక పుణ్యభూమి-ఆర్యావర్తము. ఇందు సంఖ్యాకములగు పుణ్యక్షేత్రములు అనంతములగు దేవాలయములు-దేవాలయములలో కొన్నింటికి నిత్యపూజార్చనాదికములు నిర్విఘ్నముగా నెఱవేరుచున్నవి. అందులకు కారణమా ఆలయార్చకులు పరమభక్తులు, విజ్ఞులగుటయే

ఇట్టి ఆలయాలలో నెన్నదగినది మా బాపట్ల కలతి యూర మందున్న కర్లపాలెమునందు వెలసిన శ్రీజనార్ధనస్వామిదేవస్థానము- దీని యర్చకులు శ్రీమాన్ బృందావనం వారు. ఈ వంశమంచలి చివురు కొమ్మ కూడ చేవ గలది.

ఈ బృందావన వంశమువారు పూర్వము నుండియు మహాకవులు. వేదాంత విద్యావిశారదులు, క్రీ.శ. 18వ శతాబ్దికి చెందిన శ్రీమాన్ కవిరత్న బృందావనం లక్ష్మణాచార్యులవారు ఈ దివ్య ప్రబంధమును రచించిన మహాకవులు.

వీరు మహాపండితులు ఉభయ వేదాంత ప్రవర్తకులు. విశిష్టాద్వైత సిద్ధాంత పరులు. శ్రీరంగనాథస్వామికి పరమభక్తులు. అందుకే ఈ కృతి శ్రీరంగనాథాంకితమైనది.

శ్రీమాన్ లక్ష్మణాచార్యులవారు విజయనగరం, తోట్లవల్లూరు మున్నగు రాజాస్థాన గౌరవములందు కొన్న ఘనులు. అయినను పరమ పవిత్రమగు స్వామిసేవను వదలక 'జనార్ధనస్వామి' కర్చకులుగానుండి, వారి చరిత్రను కవితాగానమొనర్చి ధన్యులైరి. ఇందువారు కర్లపాలెము క్షేత్ర మాహాత్మ్యమును గూడ చేర్చి ఆ గ్రామమునకు అక్షరత్వమును ప్రసాదించిరి.

శ్రీమాన్ లక్ష్మణాచార్యుల వారు ఆ పరిసరములలో ఎందరకో కవితా విద్యలో గురువులై ధన్యమార్గమును జూపిరి.

ఎన్నో కృతులు—— శ్రీవేంకటేశ్వరాష్టకము, తిరునామములు, రాజకంఠీరవశతకము ఇత్యాదులు రచించి, "సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్?" అనుసూక్తి లక్ష్యముగా ఆత్మానందానుభూతితో హాయిగా జీవన యాత్ర సాగించిరి.

శ్రీజనార్దనస్వామి దేవస్థానం మేనేజింగ్ట్రస్టీవారు ఇప్పుడీ జనార్దనాభ్యుదయమును పునర్ముద్రణముగావించి ఎంతయో పుణ్యముగట్టుకొన్నారు. ముద్రణము కవితతోపాటు రమ్యముగానున్నది. వైష్ణవభక్తులు కవితా కళాప్రియులు, సహృదయులీకావ్యమును పఠించి ఇహపర సౌఖ్యములకు పాత్రులు కాగలరని ఆకాంక్ష.



పండితశేఖర - ఉభయ వేదాంత ప్రవర్తక-
శ్రీనారాయణం రఘునాథ చక్రవర్తి భట్టాచార్యులు
ఖాజీపాలెం.

శ్రీమతంబైన భరతఖండంబున గ్రామనగర నదీ పర్వతారణ్య భూముల భగవద్దివ్య లీలా విలాస ద్యోతకంబులై భక్త రక్షణ పరాయణంబులై భగవానుని యర్చావతారములు విలసిల్లుచున్నవి. వివిధ విచిత్రానంత లీలా విలాస వినోది యగు నా యాదిమూర్తి పర వ్యూహ విభవ అంతర్యామి అర్చారూపంబుల పంచధా విభక్తం బైన యాత్మ స్వరూపమును ఏకైక లోకోపకారంబుగా నావిర్భవింప జేసి స్వభక్త జనరక్షణంబును అశిష్ట జన శిక్షణం బను ప్రయోజనముల స్వయముగా నిర్వహింపు చుండుట శ్రుతి స్మృతీతిహాస ప్రసిద్ధమగుట యే గాకఅద్యతన లోక ప్రసిద్ధమును అయి ఉన్నది.

"యతోవాఇమాని భూతాని జాయంతే" యిత్యాది శ్రుతి ప్రతిపాదితం బయి పర స్వరూప విశిష్టం బైన పరబ్రహ్మ శ్రీమన్నారాయణుడే "స ఏకః పంచః పంచాఽత్మా" అను పారమాత్మికోపనిషద్ వాక్య నిరూప్యమాణుం డగు పరాత్పరుడు "అథ పురుషోహవై నారాయణో కామయత ప్రజాః సృజేయేతి" అను నారాయణోపనిషత్ ప్రతిపాదిత సర్వ జగత్సృష్టి మూలకారణ మైన పరతత్త్వము- ఆ పరమ పురుషునే "ఆపో నారా యితి ప్రోక్తా ఆపో వై నరసూనవః తాయదస్యాయనంతేన నారాయణ స్మృతః" అనియు "వైకుంఠేతు పరే లోకే శ్రియాసార్ధం జగత్పతిః ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగ వతై స్సహ" అనియు అనేకస్మృత్యుప బృంహితం బైన శ్రీమహావిష్ణువు ఆపరాత్పరుడైన నారాయణుడే-విష్ణుపురుష సత్య అచ్యుత అనిరుద్ధాది వ్యూహరూపు డనియూ "స దేవై రర్థిత శ్రీమా న్రావణస్య వధార్థిభిః కౌసల్యాయాం దశరథాత్ జజ్ఞే విష్ణుస్సనాతనః" దేవకీ పూర్వ సంధ్యాయాం ఆవిర్భూతః అనియు "వాసుదేవ స్సనాతనః అనియు, పురాణేతి హాసంబుల శిష్టరక్షణ దుష్టశిక్షణైక ప్రయోజనతయా అవతీర్ణమైన విభవావతారంబులు. నారాయణైక మూలములేయనియు, సర్వాత్మావనార్ధము సృజన భరణ, రక్షణాది క్రియలు స్వాయత్తంబుగా ప్రకాశించు నా స్వామియే ప్రత్యేక వస్తు స్వరూప- స్థితి- ప్రవృత్తి నిర్వహణకై అంతర్యామి గా సర్వభూత హృదయాకాశ నివాసి యై యున్న పరమేశ్వరుడు శ్రియఃపతి- ధన్యులై తత్కాలోప జీవులైన దేవతా ముని మానవ శ్రేష్ఠుల చే సేవింప బడి వారలకు స్వ సాయుజ్యము ననుగ్రహించి తదేక నిష్ఠా గరిష్ఠత నిరం తర సేవా భాగ్యమును గోరి తపియించు భక్తానుగ్రహ కారణము గా తనను త్రైకాలికావిచ్ఛిన్న సేవ్యమానం బైన యర్చా రూపంబున నావిర్భవింప జేసి సర్వ దేశ సర్వ కాలముల యందలి భక్తాగ్రగణ్యులైన ఆళ్వారాచార్యుల కే గాక అస్మదాది జన సామాన్య నయన మనః కరణ గోచరుం డై నైమిశ

బదరీ, భద్రాచల వేంకటాచల, శ్రీరంగ, కర్లపాలెం ఆది దివ్య క్షేత్రముల స్వయం వ్యక్తుడై సేవాపరులైన భక్త శ్రేష్ఠుల తరింప జేయుచున్నాడనునది. నిశ్చప్రచమైన వచనము గదా!

భక్తానుగ్రహ శీలమై సర్వ సులభ సంసేవ్యమై సౌలభ్య సీమాతిశయ ప్రకాశిత కళ్యాణ గుణ గణ నిధానమైన యర్చా మూర్తిని స్వీకరించిన శ్రియఃప్రతి ఆశ్రితావన దీక్షా దక్షుడగుటచే- స్వభావజ్ఞులైన మహర్షుల చేతను మహర్షి తుల్యులైన మానవోత్తముల చేతను విశేషణ ప్రార్థ్యమానుండై నగర గ్రామ నదీ పర్వతారణ్య ప్రదేశముల నా యా సేవాసక్త సేవక చిత్తానుకూల స్థల విశేషంబుల నా యా స్వరూప భేదంబుల నవతరించి సర్వకాల సర్వజీవ సంసేవ్యుండై విరాజిల్లు చుండుట సమస్త మానవ మనో విదిత మైన విషయమే-

వివిధ విచిత్రానంతైశ్వర్య ప్రకటనా శీలంబులై యనంతములైన నా స్వామి విభూతు లను దేవతలు ఋషులు దేవతావిశేషానుగ్రహ పాత్రులగు కవివర్యులు అనేక ప్రకారంబుల సేవించి స్తుతించి ప్రబంధీకరించి తరించిరి అష్టాదశ పురాణంబుల సంహితా సముచ్చయమున స్మృతి సమూహంబుల యితిహాస సముదయంబున సుప్రసిద్ధములైన రంగేశ వేంకటేశాది స్థల మాహాత్మ్యముల వోలె సామాన్య గ్రామారణ్యముల నివసించి తత్తద్దేశ నివాసుల నాతీయత ప్రోచు నర్చావతార విశేష స్వరూప స్వభావ ప్రభావ ముల విశదీకరించు నెన్నో రచనలు తద్భక్తి భావ సంధుక్షిత ప్రణయ సార రసౌఘ పూర్ణ హృదయంబులనుండి వెల్లివిరిసి మానస సరోవరాగత గంగా తరంగిణీ పరంపరలో యన భారతభూమిని భక్తిసార సంపన్న మొనర్చినవి-

ఛప్పన్నరాష్ట్రముల నెన్నోండు భారతమాత పాదపంకేరుహంబుల నలంకరించు రత్నాలంకృత మంజీరమో యన నొప్పు నాంధ్రరాష్ట్రము ఋషి గణ రాజగణ మహాగణ మనుజగణ గణ్యనివాసంబై గణనకెక్కినది. అందు

సర్వసస్య సంపత్సమృద్ధమై వేదవేదాంగ జ్ఞాన తత్పర క్రియాశీల సంప్రాప్త బ్రహ్మజ్ఞాన సహిత బ్రాహ్మణ మండలంబును, శౌర్య ధుర్య ప్రతాపార్జిత భూమండల షోడశ మహాదాన సంపాదిత యశశ్శోభా వినిర్జిత సూర్యమండలంబగు రాజ్మండలంబును, వాణిజ్య వాణీ నైపుణీ సమూహిత సంపద్భార వినీత వినయ యశో విభ్రాజితార్య వైశ్య మండలంబును, సమస్త కలా కలాప సముపార్జితానంతైశ్వర్యావాప్త నయ వినయ వాఙ్నైపుణీ విరాజిత శ్రుతి స్మృతి పురాణేతిహాస జ్ఞానాపహసిత సూత సౌత మండలంబును, అగు గుంటూరు మండలంబు సకల మనుజ మనోహర హర్షాపాదియై సర్వ సస్య సమృద్ధి కారణంబైన చంద్రమండలం బో యన విరాజిల్లు చుండెను—

సుప్రసిద్ధమైన దండకారణ్య దక్షిణ భాగంబున కణ్వారణ్యము పూర్వ సముద్ర తీరంబున కణ్వాది మహర్షి నివాస యోగ్యమై సకల వృక్ష సముదాయ సంకలితమై ఫల పుష్ప పరిశోభితమై విరాజిల్లు చుండెను. అది యిప్పటి గుంటూరు మండలాంతర్గతపూర్వ సముద్రతీర ప్రాంతమున ముని రాజ నివాస యోగ్యమై ప్రసిద్ధికెక్కినది. కలియుగాంతర్గత చతుర్థ విభాగంబున కృతయుగారంభమున భృగ్వాది మునిగణంబు యీ కణ్వారణ్యమున కృత సత్కార్య సంకల్పులై యొక మహాయజ్ఞము జనార్దనోద్దిష్టముగా సేయ నుత్సహించి సునిర్మల జలప్రవాహ సలిలోత్తుంగతరంగ యగు తుంగభద్రా తీర ప్రశోభి కణ్వాశ్రమంబున- నిరంతర సత్ర యాగ దీక్షితులై సతతాన్న దాన పరితోషితులై సర్వవర్ణ జనానీకులై జనార్దనావిర్భావ కౌతుహల ప్రతీక్షమాణ మానసులై యుండునంత నా భృగుమహర్షి యజ్ఞగుండమున నావిర్భవింపుమని- యర్చామూర్తిగా వేంచేయుమని ప్రార్థింప ప్రత్యక్షంబుగాకున్న మూర్తిత్రయ పరీక్షావసరంబున మహావిష్ణు వక్షంబున పాదఘాతం బొనర్చిన మహాపరాధంబు క్షమింప డోకో! యని "వేకటి యాకటి పెల్లున బ్రుక్కు నటుల కటకటం బడి" భక్తి బ్రణమిల్లి ప్రార్థింప-తన భక్తారక్షా దీక్ష

కొరవడ కుంఠ శ్రియఃపతి క్షమాభిక్ష నీయ ప్రసన్నుండయ్యెనో యని మునులెల్ల రిచ్చవడి యజ్ఞకుండంబున "శ్రీజనార్దనస్వామి" యావిర్భవించెను. ఇది కణ్వాశ్రమమున భృగుముని కృత మహావిష్ణు యజ్ఞ ఫలము–దివ్యదృక్ఛాగత బ్రహ్మర్షి రాజర్షి మనుష్య మహాభాగ్య ఫలము. యీ మహత్ఫలము తరువాతి తరముల ప్రజలకు లభింప జేయ నుద్దేశించి అదే విధముగా సేవ సాయించుచూ సేవకానుగ్రహ సముత్సాహుడ వై వేంచేసి యుండు డని భృగుమహర్షి మహాభక్తిపూరితాంత రంగుడై లోకానుగ్రహ కాంక్షియై కోరిన కోరికకు ఫలము-కణ్వారణ్యాంతర్గత కణ్వాశ్రమ ప్రదేశమున శ్రీజనార్దనస్వామి యందలి భక్తి రక్తి దవిలి దిన పక్ష మాస ఋత్వ యన సంవత్సరోత్సవంబులంజేయుచూ మహానంద డోలికల నూగుచుండిరి. శ్రీజనార్దనస్వామి తద్భక్తి పరవశులైన యా యాశ్రమవాసుల సంపూర్ణ ముగా ననుగ్రహింపగా నచటి జనులు పరిపూర్ణైశ్వర్య వంతులై పాడి పంటల సమృద్ధిం దనరి పరులకు శ్రీకరులై ప్రభవింప యవ్వారి పేర్వాసిం దగిలి కాబోలు "శ్రీకరులపురి"గా కణ్వాశ్రమంబు ప్రసిద్ధమై తత్కాల రాజన్య పరిపాలనంబున "శ్రీకరుల-శ్రీకర్లపురి"-గా వ్యవహరింప బడినది. "పదునెనిమిది పేటలు" గలిగి వైభవోపేతమై ప్రసిద్ధి నొందిన పట్టణ మియ్యది.

చంధనగిరి (చందవోలు) పట్టణము రాజధానిగా శాసనాధికారము చెలాయించిన మహారాజుల ఏనుగులు తండోపతండములుగా అర్జునారణ్యమున ("మద్దిఅడవి) ఇది కర్లపాలెము నుండి బాపట్ల వరకూ పూర్వసముద్రతీరము నాక్రమించి యుండెడిది" విహరించి-ఆహరించి-సమీప గ్రామమైన కర్లపాలెం ప్రాంతమున విశ్రమించెడివి. కరులు విశ్రమించు చోటగుటచే కరులపాలెం కర్లపాలెముగా వ్యవహరింప బడిన దని యొక నానుడి-యీ స్థలమునే "నెలకుదురని" వ్యవహరించుట కావ్యప్రసిద్ధమైయున్నది-దీనికిదియే

కారణమై యుండవచ్చును "చంద్రగిరి" "చంద్రవోలు"-"చందవోలు" యను నగరప్రాంత ప్రసిద్ధస్థలమగుట తెనుగుపల్కుబడివి రసికులైన కవిజనులు "నెలకుదు"రని వ్యవహరించి యుందురని ఊహింప దగియున్నది.

యిట్టి మహావైభవము గల్గిన శ్రీజనార్దనస్వామి- శ్రీకర్లపురీ నివాసుడై అశేష జన సంసేవ్యమానుడై వేంచేసి యున్న దివ్య స్థలమును- జనార్దన పురమని (జనార్దనంపాడు) అనియూ అప్పటిపెద్దలు వ్యవహరించెడి వారట జనార్దన సంరక్షితమై సర్వసంపదలలో విరాజిల్లు నీ పురము కాలోపహతమై వైదేశక పాలకాభిభూతమై క్రమక్రమముగా క్షీణించి, క్షీణించి పురము గ్రామమై గ్రామము పాలెమై పోయినది ఆహా- కాలమహిమను ఏమన గలము? భూకంపములకు సముద్రపు టుప్పెనలకు గురియైన దీనగరము జనార్దన పాలితమగుట ఈ నవీన రూపము- "వాసాంసిజీర్ణాని" అన్న భగవ ద్వచనానుసారముగా ఈ కర్లపాలెం స్వయంభువుడు జనార్దనస్వామి వారి నూతన రూపములు—

శ్రీజనార్దన కటాక్ష పాత్రమై-తద్దయార్ద్ర హృదయోపలాలితమైన విశే షమున మహర్షి తుల్యులగు జనంబులకు జన్మభూమియై-రత్నగర్భయో? యన నీగ్రామము తన కీర్తి ప్రతిష్ఠల నిలుపు కొనుచునే యున్నది-కవులు గాయకులు-నటులు-పేరు ప్రతిష్ఠలు గడించిన వారెందరో! కళా కారులు మహాభక్తశిఖామణులు యీగ్రామమున నావిర్భవించిరి-

పండిత శేఖరులు-కవి కులాలంకారులగు- "కవిరత్న శ్రీమాన్ బృందా వనం లక్ష్మణాచార్యుల వారు ఈ కర్లపాలెం గర్భ శుక్తి ముక్తా ఫలమే- వీరు తోట్ల వల్లూరు విజయనగరం- పిఠాపురం రాజమహేంద్రవరం మొద లగు రాజాస్థానములలో దేశికులు గా-ఉపదేష్టలుగా- ఆస్థానకవులుగా-వ్యవ రించిన వారు-వీరే శ్రీజనార్దనాభ్యుదయ గ్రంధకర్తలు — వీరిది భారద్వాజస గోత్రము-బృందావనవంశము- తల్లి వేంకమాంబ-తండ్రి జనార్దనాచార్యులు-

వీరు తమ ఏలిక యైన జనార్దనస్వామిని ఈ మహాకావ్యమున శతకములు, అష్టకములు చక్కని సుగంధివృత్తపరీమళ విరాజితములైన అచ్ఛాచ్ఛవాగ్గుచ్ఛములతో నలంకరించినారు "గేయే నాట్యేచ సౌలభ్యం" అన్న నానుడికి లక్ష్యముగా కీర్తనల సంపుటిని పరోపదేశ ప్రాధాన్యముగా కూర్చినారు. ఇవి సంప్రదాయ బద్ధమైన భక్తి ప్రపత్తులను ప్రదర్శించు నవి. ఆచార్యాజ్ఞ ననుసరించి ఈసంకీర్తనాసంపుటికి "తిరునామములు" అను తిరునామ ముంచినారు. "యన్నామకీర్త్యతే నిత్యం హరే స్సర్వ శుభాస్పదం" అను నార్య సూక్తికి లక్ష్యభూతములీ తిరునామములు- శ్రీహరి భక్తికి పరాకాష్ఠా స్వరూపమైన ఆచార్య సేవాస్వరూపమును చక్కగా విశద ఫణితిని బోధించు దివ్య బోధనలు-నిలవుటద్దమున సర్వాంగ సుందరముగా నలంకరించుకొను నవ యువమండలి వలె శ్రీవైష్ణవ సమాజమునకు సర్వాంగ ప్రసాధన సాధనమైన ఆదర్శము లీ సంకీర్తనములు - ఇవి నిజముగా తిరునామములే- వీరి రచనలు లోకప్రియములు వీరి పద్యములో తిరునామములలో కంఠస్థము చేయని వైష్ణవ ప్రాణి యొక్కడునూ లేడనుట అతిశయోక్తి కాదు-

వీరి గ్రంథములు 1. జనార్దనాభ్యుదయము (కావ్యము) 2. జనార్దన శతకము 3. రంగశతకము 4. నృసింహదండకము 5. అష్టకముల సంపుటి 6. తిరునామములు (కీర్తనల సంపుటి భజనకు నాట్యమునకు అనుకూలము లైనవి.) 7. రాజకంఠీరవ శతకము 8. రామ కథాసంగ్రహము ఇవి ముద్రితములు — అముద్రితములు 1. ఆచార్య స్తవము 2. సాత్త్వికబోధ 3. పంచ సంస్కార దర్పణము 4. శ్రీనివాస దీక్షితీయ చక్రాంకణ ప్రమాణ దీపికా వ్యాఖ్యానము.

ఈ మహాకవి క్రీస్తు శకము పదునెనిమిదవ శతాబ్దము వాడు.

## శ్రీ జనార్దనాభ్యుదయ కావ్యము

శ్రీజనార్దనాభ్యుదయ కావ్యము సుమధుర వాక్చమత్కృతులతో లలితమై ద్రాక్షా పాకమున విరాజిల్లు చున్నది. కృతి ప్రారంభమున ఒకచమత్కారము

ఈ మహాకవి ఒక క్రొంగ్రొత్త మార్గమును త్రొక్కినారు. వీరు శ్రీరంగ నాధునికి పరమప్రపన్నులు తాము జనార్దనుని యర్చామూర్తి ప్రాదుర్భావ విషయము ప్రతిపాదింప బోవుచున్నందున బ్రహ్మదేవుని యర్చామూర్తియైన శ్రీరంగనాధుని సౌజాత్య రత్నస్తుతి గావించినారు. దీనిచే వారు కధావస్తువు అర్చావతారాన్వితమని సూచించి నట్లైనది. శ్రీరంగనాధుడు వరయూర్ తాయారు నిద్దపుచెక్కుటద్దముల ముద్దిడు కొన్న అధరబింబముతో శ్రీదేవి మోవిని చుంబించినారట ఆమె చెక్కుల జవాజి కస్తూరికా మిళిత కర్పూరము ఈమె మోవిపై నంటుకొనినది. అందులకా శ్రీదేవి నవ్వుకొని- "దేవరలిక్షు సారమున దెచ్చి తృటీరజముంచ భోగ్యమే అన్నారట ఆ శ్రీరంగనాయకీ వ్యంగ్య వచనమునకు చిరునవ్వుతో జవాబు సరిపెట్టిన దొంగ-రంగభర్త" ఎంత చమత్కారము? ఇది యిష్టదేవతా స్తుతి తరువాత శ్రీవైష్ణవ సమృద్ధిం దలపింప జేయు విష్వక్సేనుని మొదలు ఆళ్వార్ల వరకు స్తుతించినారు. గణాధిప సరస్వతీ స్తుతులకు బదులుగా విష్వక్సేన-హయగ్రీవాదుల స్తుతించుట వీరి వైష్ణవ నిష్ఠా ద్యోతకము-

ఈ కావ్యమున నదీ నగర సముద్రఋతువర్ణనలుండుట చే మహాకావ్య లక్షణ లక్షిత మనదగును. "గూని గోవింద భట్టు"నకు బంగారు బొమ్మ వంటి మేనమామ కూతునిచ్చి పెండిలి చేయించుటలో అత్తను పెండ్లికూతురిని సంతృప్తి పరచుటకై గూనివానికి తనదివ్య సుందరరూపము ప్రసాదించిన బిందుమాధవుని మహా ప్రభావము అద్భుత రసావహము యీ కథ యందు హాస్య రసము పతాకస్థాయి నందు కొన్నది-

వర్షా ఋతు వర్ణనమున- పిల్లలు వానలో దిరిగి తల తడుపుకొని వచ్చినారు. పడుచు తల్లులు తమ పైట చెరగులతో పిల్లల తలలుతుడుచుచున్నారు. సన్నిహితులైన ప్రియులు కొంటెగా "ఆహా పయోధరములు నిరంబరము గాగా నెన్నడు చూడగల్గితిమి" అనినారట "ప్రియురాండ్ర కోరచూపుల

మోదుగుపూలు క్రిములను పుట్టించినవట" ఇది షడ్ఋతు వర్ణనలో ఒక చమత్కార వచనము- వసంతఋతువును వర్ణింపుచూ ఒక చక్కని యుపాలంభమును వ్యంగ్యము చేసినారు. ఈ చిన్న పద్యములో

"వర్ష మొకటి గాన మా వారు పంప,
పెరిగి భాష్యాంతరమ్మున శైవవాది
ద్వైతులు లెత్తిరి మా పంక్తి పలుగు తనుచు,
కాకములు నిరసించెను కోకిలలను-

రామానుజుల వారు యాదవప్రకాశకులను అద్వైత సన్యాసికి శిష్యులుగా చేరి వేద వేదాంత శాస్త్రగ్రంథములను సేవించినారు. తరువాత విశిష్టాద్వైత భాష్యమును జీవేశ్వర భేద ప్రధానముగా రచించినారు. బ్రాహ్మణవర్ణ సామ్యా మున పోక శిష్యులై మా వద్ద విద్య నభ్యసించి మరియొక పలుకు పలికిన మీరు మా పంక్తికనర్హులని అద్వైతులు యాదవ ప్రకాశకులకు చెందిన మతా రామానుజుని నిరసించెనని వ్యంగ్యము ఎంత మనోహర వ్యంగ్యమో పాఠకలోకము గమనించును గాక- ఇట్టి చమత్కారములు వీరి కవితాతరంగములపై కుప్ప తెప్పలుగా తేలియాడు చున్నవి.

అలౌకికము లైన బ్రహ్మలోక కైలాస వైకుంఠాది వర్ణనము కనులకు కన్పట్టినట్లు సహజ మనోహర భాషలో వర్ణించినారు, భృగు యజ్ఞ వర్ణనమున యాయజ్ఞాంక ప్రయోగములు మహాజన కోలాహలములు, అన్నదానములు ప్రేక్షకుల సంతోష భరితస్వాంత వచనములు- పాఠక లోకమునకు ఆ యజ్ఞమును కట్టెదుట కాన్పింపజేసి నట్లున్నది రచనా విదగ్ధత.

అతి లలిత కవితా కవన శైలియయ్యును వీరశైలి, మొక్కొక్కచో శాస్త్రీయ సందర్భముల వివరించు పట్టుల గ్రంథ గ్రంథుల వంటి పద్యముల నల్లినది. ఇది వారి అసదృశ పాండిత్య ప్రభావమునకు ఉదాహరణ

మందుడు పండితులు-బహుశాస్త్ర సంగ్రహ తత్పరత-భాష జటిలము కాక తప్పదని కవు లందురు-భావానుకూల వృత్త కల్పనము-సరస వచనము లతో రస ప్రవాహమై ప్రవహించిన దీకావ్య వాహిని-చక్కని అలంకారములు నలరింప జేసినా డీ కవి-కావ్యకన్నియను- శ్రీరంగనాథుని కర్పింప మహాలక్ష్మిని వలె అలంకరించి-అర్పించి- "భృగువు భార్గవి నర్పించి" ధన్యుడైన కీర్తి విఖ్యాతనంది నాడీ భారద్వాజ కుల పవిత్రుడు- శ్రీమాన్ లక్ష్మణాచార్యులవారు- పరమ ప్రపన్నులు-యోగ్య నిష్ఠా గరిష్ఠులు- నిరంతర జనార్దన సేవా తత్పరులు-జయతి-తరాం-

శిథిలావస్థలో నున్న ఈ శ్రీజనార్దనాభ్యుదయ గ్రంథ సముద్ధరణకై జీర్ణాతి జీర్ణప్రతినొక దానిని సాధించి-సుపాఠము నిర్ణయించి సమగ్ర రూప కల్పన జేసినవారు శ్రీమాన్ వేదాలవరదాచార్యులగారి కుమారుడు వేంకటప్ప లాచార్యులుగారు వీరు మహాకవులే గాక-మంచి నటకులుగా పేరు ప్రతిష్ఠలు గడించిన వారు- ఎన్నో నాటకములు రచించి ప్రదర్శనలిచ్చు చున్న వారు-యంత్రశాస్త్రప్రవీణులు- చిత్ర విచిత్ర బంధకవితా నిపుణులు- క్లిష్టాతి క్లిష్టమైన బంధకవిత వీరి లేఖినీ లాఘవమున కనేకానేక రూపములు గూర్చుకొనినది- శ్రీ - పద్మ - రథ-గోపుర-ఛత్ర-చామర-ఖడ్గ-దేవాలయ-నాగ-మాలి కాది బంధము లెన్నియో ! చిత్ర విచిత్ర వర్ణాంకితములై సమస్త పండిత పామర జన మనోరంజకము నొనరింపు చున్నవి-వీరు ప్రస్తుతం "తాలూకా జూనియర్ కళాశాలలో"-హిందీ భాషా పండితులు గానున్నారు పరమ కరుణాంతరంగు డైన జనార్దనుడు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధుల నం దించు గాక-

శ్రీజనార్దనస్వామివారి అర్చకులు భృగుమహర్షి యజ్ఞ యాయజూకుడైన భరద్వాజ మహర్షి సంతతి-భారద్వాజస గోత్రజులే-బృందావనం వారి వంశ నామముగా ప్రసిద్ధి కెక్కినది-ఒకానొక కరువుకాలమున గౌతమ భారద్వాజస

గోత్రజులైన వైఖానస మహర్షులు-బృందావనము నుండి ఆంధ్రదేశమునకు విచ్చేసి రనియూ- గౌతమ గోత్రజులు కృష్ణా గోదావరీ మండలములందును భారద్వాజస గోత్రజులు శ్రీకర్లపురి జనార్దనస్వామి వారి నిత్యకైంకర్యాసక్తులై యున్నారని యూ- ప్రతీతి- ఇదే వీరి బృందావన వంశ నామము నకు కారణము—

శ్రీవత్సస గోత్రజులు-శ్రీవైష్ణవు లైన గుంటూరు వంశనామము వారు గూడా అనాదిగా ఈ గ్రామప్రాతినిధ్యము వహించుచునే యున్నారు—

ప్రస్తుతం శ్రీజనార్దనస్వామివారి దేవస్థానమునకు మేనేజింగ్ ట్రస్టీగా నున్న శ్రీగుంటూరు అప్పలాచార్యులు వంశపరంపరాగత ప్రాభవ ప్రాశస్త్యములకు భక్తిప్రపత్తులకు- ప్రతీక- క్రీ.శ. 1970లో ఈ చిరంజీవి యోగ్యతను- ప్రావీణ్యతను గమనించి దేవాదాయ ధర్మాదాయశాఖవారు ఈదేవస్థాన పాలకవర్గమునకు మేనేజింగ్ ట్రస్టీగా నియమించి నారు—

ఈ చిరంజీవి- నయశీలి- వినయశీలి- వివేకశీలి- సరసుడు- సహృదయుడు- మృదుభాషి సామదానక్రియా దక్షుడు- కళాభిమాని

కాలగ్రమాను గత క్షాతిన్యములకు లోనై జీర్ణమై శిధిలావస్థలో నున్న శ్రీస్వామివారి దేవస్థానము- ఈచిరంజీవిపాలనలో సర్వతోముఖ శోభావంతముగ రూపుదిద్దుకొనుచున్నది. నిత్యోత్సవ వారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ వార్షికోత్సవములు నిర్వహింపబడుచున్నవి- శ్రీజనార్దన స్వామి కళాపీఠము వెలసినది— అన్నిటికిని మిన్నయైన దీ కర్లపాలెం క్షేత్రమహాత్మ్యమును వివరించు శ్రీజనార్దనాభ్యుదయ ప్రకాశనము- వీరివంశము సాహితీ రంజకమనియూ-సాద్భుత భక్తి స్ఫోరకమనియూ తెలుపుటకీ తార్కాణమే చక్కని గీటురాయి—శ్రీమాన్ లక్ష్మణాచార్యులుగారి కృతులన్నియూ క్రమక్రమముగా ఈచిరంజీవి సహాయముననే వెలుగు నందుకొనగలవు— ఈ చిరంజీవికి

చేదోడు వాదోడుగా సహకరించుచూ ప్రతి వైవకార్యమునకూ సత్కార్య మునకూ సానుకూల పడుచున్న ఈ దేవస్థాన పాలకవర్గ మెంతయో ! కొని యాడ దగియున్నది. ఈ చిరంజీవికి తక్కుంగల పాలకవర్గమునకు శ్రీజనా ర్దను డితోధిక సహాయ సహకార సంపత్తులకై సత్కార్య సాధనలకై సమగ్రాయురారోగ్యైశ్వర్యానుకూలము లనుగ్రహించు గాక-

మంగళం మహత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ



## 'త్రివేణి'

మధురకవి : శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు
తెలుగు పండిట్ - పరుచూరు.

శ్రీ జనార్దనాభ్యుదయ మనెడి యీ కృతి -

"మొలక వెన్నెల నగునవ్వు మురువుతోడ
జిలుగు బంగారు మేలి దువ్వలువ తోడ
కుండలీంద్రుని శయ్య్య బరుండి నాదు
కలను మేలివ్వ గలనంచు గానుపించి

ఏను శ్రీరంగ నాథుండ నీవు జేయ
బూనుకొనిన జనార్దనాభ్యుదయ మస్మ
దంకిత మొనర్చుము"—

అని రచయితతో పల్కిన శ్రీ రంగనాధుని యాదేశాను సారముగ ఆ స్వామికే సమర్పితమైన రసవత్ప్రబంధము.

విబుధావళి ధృతికి, యశః
కబళిత దిక్తతికి కనక కవచ మణీవిభా
శబలిత దివ్య వధూజన
కబరీ శ్రీ తతికి రంగ కమలా పతికిన్-

గ్రంథమును కృతియిచ్చి రచయిత తాను చరిత్రలో సుకృతియై నిలిచినాడు. కవియొక్క మహా భాగ్యగరిమ యిది. ఆ కవిరత్నము బృందావన పారిజాతముగుట- అస్మదాదుల యదృష్ట విశేషము.

ప్రతి పదమును మధుర రసాస్వాదముగ పలికి, ప్రతి సన్నివేశమును సజీవముగ మలిచి, కథను సుఖగా జాలువార్చిన కావ్యకర్తకు గల అప్రతిమాన వైదుష్య వైశిష్ట్యము పాఠకాళిని అడుగడుగున ముగ్ధుల గావించుచుండును.

కొన్ని దశాబ్దముల వెనుకకు దృష్టిసారించి పరిశీలించిన రస స్యందియైన యిట్టి కవిత నల్లగలవా రెందరుందురు ?

లలితమైన ఊహ- ఊహకు తగిన రూపచిత్రణ నల్పగల శాబ్దికశక్తి-శబ్ద గర్భితమై చవులూరించు లాలిత్యము- లలిత విలాస విన్యాసముల కాలవాలముగ నలరారు శయ్యా సౌభాగ్యము- శయ్యా వైభవమున క్రొంపు సొంపుల ఘటించెడి అలంకార చతురిమ- అలంకారిక శోభకాలంబనమైన మేలి సొగసుల జిలికెడి వర్ణన- వర్ణనకు వన్నెగూర్చు వస్తువు- వస్తువునకు జీవము పోయు కల్పన- శ్రీ జనార్దనాభ్యుదయ ప్రబంధ సౌధశిఖర సీమల దివ్య దీధితుల విరియజేయు మణిదీపికలై విరాజిల్లినవి. ఏతాదృశ సల్లక్షణ లక్షితమైన యీ రచన నిర్మల తరంగ భంగిమల సంఘర్షణతో నొడ్డులొరసి కొనుచు ప్రవహించెడి పావన గంగకు ప్రతీక. మధుర సుధాజలధి మహిమను ప్రస్ఫుటీకరించుటకై మందార మకరంద బిందుసందోహ

ములెన్నింటి నుపహరించిన నేమగును? ఈ ప్రబంధమున కర్లపాలె మలో వెలచేసియున్న శ్రీ జనార్దనస్వామివారి దేవాలయ స్థలమాహాత్మ్యము వర్ణితమై యున్నది.

అది కృతయుగంబు నందు కణ్వాశ్రమం-
బవల కణ్వపుర మహాఖ్య త్రేత-
ప్రబల 'శ్రీకపుల పురము' ద్వాపరమ్మున-
'కర్లపుర' మనంగ కలిని బరగె.

పవిత్రమైన ప్రాచీనగాథ యెంతయో గల యీ స్థల మాహాత్మ్యమును హృద్యముగ నిట్లు ప్రబంధాకృతితో సంతరించిన సారస్వత రసోపాసకు డగు మహాకవి శ్రీ స్వామివారి చరణ సరసీరుహార్చకుడై మనుగడను ధన్య మొనర్చుకొనిన జాలిన శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్య సూరి వరేణ్యులు.

ఆయన నిత్యము జనార్దన ప్రభువు పాదాల కొలువులో నిమీలిత నేత్రుడై నిల్చి- ఎట్లా దేవదేవుని లీలావిలాసముల ననుభూతికి తెచ్చు కొనగల్గెనో! ఎట్టి శేముషీశక్తితో శ్రీ జనార్దనాభ్యుదయ కథావిన్యాస చిత్రణకు బూనుకొనెనో! ఎట్టి సుకృత మొనర్చుకొనెనో! ఏ తపస్సు లాచరించెనో! ఏ పూలపూజల వాణి యనుగ్రహమును బడసెనో! ఏమో! శతాబ్దములు గడచినను- తరము లంతరించినను చెక్కు చెదరని కవితా శిల్పమునకు, మొక్కవోని శక్తి ప్రపత్తియుత భావ వైభవమునకు- 'కాణాచి'గా శ్రీ జనార్దనాభ్యుదయము నిలిచియున్నది. నిలిచియుండగలదు.

జనార్దనస్వామివారి దేవస్థాన పాలకవర్గము నే డీ ప్రబంధమును పునర్ముద్రణ మొనర్చుట మహా విశేషము.

స్థలమైపము కథానాయకుడు. శ్రీ వైఖానస కులాలంకారుడైన స్వామి వారి వంశ పారంపర్యార్చకుడు గ్రంథకర్త- దేవాలయ పాలకవర్గ సభ్యుల ప్రకాశకులు, సరస సమ్మేళన మెంత చక్కగ గుదిరినది. విడదీయ వీల బడని అనుబంధము గల యీ సంబంధము వాస్తవముగ నొక పుణ్య బంధము. ఇది యొక త్రివేణి. ఈ సన్నివేశము నిట్లు ఘటిల్ల జేసిన శ్రీ జనార్దన దేవుని కారుణ్యమునకు దోసి లొగ్గవలయును.

ఈ గ్రంథ ముద్రణార్థము పాలకవర్గ పక్షమున అధ్యక్షుడుగా మా తమ్ముడు చిరంజీవి గుంటూరు అప్పలాచార్యులు పైన వేసికొనిన బాధ్యత శ్రీ జనార్దన దివ్యానుగ్రహ శ్రీకి పాత్రము కాగలదు. కవిరత్న లక్ష్మణా చార్యవర్యుని, అమందానందమున దేల్చగలదు. శ్రీ జనార్దన కైంకర్య మగ్న మానసుల భావవీధులలో పసిడి వెన్నెలల గురియింప గలదు.

ఇంత కాలమున కింత యందముగ- అందరిని మురిపించునట్లు బృందావనము మరల విరగ బూచినది.

నాడువలె నేడును కొండంత అండయై నిల్చి యీ కృషిని పండించిన శ్రీ జనార్దనస్వామివారి పాదారవిందములను కరారవిందములతో సేవించి హృదయారవిందములతో నర్చింతము.

కవియై నాడు శ్రీ జనార్దనాభ్యుదయమును వ్రాయించిన ఆ ప్రభువే నేడు దేవస్థాన పాలకవర్గ రూపమున ముద్దుగా, ముచ్చటగా ముద్రణ జేయించు కొనుచుండెనేమో ! ప్రయత్నమా రీతి మల్లెతీగవలె సాగి పరిమ ళించినది. మా స్వామి కారుణ్యబలమున- ఇట్టి యుత్తమ సారస్వతమును శ్రీ జనార్దనస్వామివారి దేవాలయ పాలకవరము సర్వదా వెల్లివిరియించు చుండవలయునని మా ఆకాంక్ష, అస్తు.

శుభమ్ భూయాత్.

★

# అభివందనము

మంతెన సీతారామరాజు - కర్లపాలెం

మా కర్లపాలెం శ్రీజనార్దనస్వామివారి దేవస్థానమునకు మేనేజింగ్ ట్రస్టీగా గుంటూరు అప్పలాచార్యులుగారు రావటం మా భక్తలోకమునకు ఎంతో గర్వకారణం- పాలకవర్గ సభ్యులెల్లరు వారికి తగిన సహాయసంపత్తిగలవారు కావటం మరీ అదృష్టదాయకం- దేవస్థానమునకు ఎన్నిరకముల అభివృద్ధి కార్యక్రమాలు సాగుతున్నవో? మా భక్తవర్గపు సంకీర్తనా కార్యక్రమాలు ఎంత మహోత్సాహంగా నెర వేరుతున్నవో? నెమరు వేసుకుంటుంటే మనస్సుమహానందంలో పరవశమై తన్మయత్వం చెందుతోంది. అన్నిటికి మించి ఏనాడో మరుగున పడిపోయిన మా కర్లపాలెం క్షేత్రమాహాత్మ్యం ఈ నాడు ఇలా వెలుగు లోనికి తీసుకొనివచ్చే కార్యక్రమం సాధించటం-ఈ మహత్తర కార్యక్రమానికి హిందూ ధర్మప్రతిష్ఠాపనకై పూనుకొనిన దేవాదాయ ధర్మాదాయశాఖవారు సహాయ సహకారాలు అందించటం చాలా గొప్ప విషయం-ఈ విధంగా మా కర్లపాలెం క్షేత్రమాహాత్మ్యం ప్రకాశింపజేసి మా గ్రామనికి మహోత్తమమైన ఆనందాన్ని అందజేసిన దేవాదాయ ధర్మాదాయ శాఖవారికి-సహకరించిన గ్రామ ప్రజలకు-కార్యక్రమం చేపట్టిన పాలక వర్గమునకు-ఆశీస్సులు ఆమోదములు అనుగ్రహించిన పండిత, మహాకవులకు-మా కర్లపాలెం భక్తమండలి తరఫున హృదయపూర్వక మైన కృతజ్ఞతలు తెలుపుకుంటూ నమస్కారము లర్పిస్తున్నాను. ఇంకా మా జనార్దనస్వామి మా ఆచార్యులుగారికి భక్తలోకం ఆనందించే అనేక మహత్కార్యాలు సాధింపగల-నైపుణ్యాన్ని ఆయురారోగ్యాలనూ- ఐశ్వర్యాన్ని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నాను-



# ని వే ద న

ఓం నమో వాసుదేవాయ "శ్రీకర్లపుర" వాసినే
శ్రీజనార్దన రూపాయ గోవిందాయ నమో నమః

దాదాపు రెండు శతాబ్దులకు పూర్వము శ్రీమాన్ బృందావనం లక్ష్మణా చార్యులగారి చే రచింపబడిన "శ్రీజనార్దనాభ్యుదయ" కావ్యమును పాఠకుల కరకమలముల కందించుట కెంతయో ఆనందించుచూ ఏతత్ గ్రంథ ప్రకాశన విషయమున రెండుమాటలు నివేదింతును.

చిరంజీవి గుంటూరు అప్పలాచార్యులు-కర్లపాలెం శ్రీ జనార్దనస్వామి వారి దేవస్థానం పాలకవర్గమునకు మేనేజింగ్ట్రస్టీగా నియమింపబడిన నాటి నుండి అనేక సత్కార్యములు మహత్కార్యములు సాధించుచున్న ఉత్సాహవంతుడగు యువకుడుగాన జీర్ణమై శిథిలమైన దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమము చేపట్టి విశ్రాంతి విరామము లేని నిరంతర కృషి సాగించుచున్నాడు. పట్టుదల ఈ చిరంజీవికి వెన్నతో బెట్టిన విద్య-తలచిన కార్యము సాధించు వరకు నిద్రపోడు_

కర్లపాలెం క్షేత్రమాహాత్మ్యమగు-శ్రీజనార్దనాభ్యుదయకావ్యమును వెలుగులోనికి తేవలయునని ఈ చిరంజీవి ఆకాంక్ష- ఒకనాడు నావద్దకు వచ్చి ఈ కావ్యముయొక్క శిథిలప్రతి నొకదానిని నా చేతికిచ్చి దీనికి సమగ్ర రూపకల్పన చేయుభారము "నీది" అని నన్ను కోరినాడు- ఆ గ్రంథము అనేక స్థలముల క్రిమిదష్టమై పఠనయోగ్యముగాకుండా నున్నది-

ఎందరో మహానుభావులైన కవిపండిత శేఖరులుండగా అల్పజ్ఞుడనైన నేను ఈ కార్యమును చేపట్టుట "దుస్సాహసమే" యైననూ- ఈ యావజ్జీవ శ్రీజనార్దన సేవా భాగ్యమబ్బునను అభిలాష- ఈచిరంజీవి అభినివేశమూ రెండునూ కలసి నన్ను కార్యోన్ముఖుని జేసినవి- నాశక్తిమేరకు నాలుగు

మాసములు శ్రమపడి ఏదో ఒక రూపకల్పన గావింప గలిగితిని. పండితులు ఉభయ వేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ నారాయణం రఘునాథచక్రవర్తి భట్టాచార్యులగారి సహాయము అభ్యుదయకవి శ్రీమాన్ బృందావనం రంగాచార్యులగారి పర్యవేక్షణ నాకుతోడైనవి. మిత్రులు-మాసోదరోపాధ్యాయులైన పండిత,పౌరాణికులు శ్రీచావలి వామనమూర్తి శాస్త్రిగారూ "సాహిత్యరత్న" శ్రీజనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు నా కెన్నో సూచనల నొసంగిరి— ఈ పెద్దల సహాయమున ఎట్లో ఈ మహాకావ్యమును మీముందుంచగలిగితిని. ఎందరో పెద్దల ఆశీస్సులు ఆమోదములు గూడా లభించినవి.

ఇంతటి మహోత్తమ కార్యసాధనకై దీక్ష బూనిన ఈ చిరంజీవికి తదితర దేవస్థాన పాలక వర్గమునకు- సహాయ సంపత్తు లందించిన దేవాదాయ ధర్మాదాయశాఖ వారికి- అండగా నిలచిన గ్రామ ప్రజలకు-సమస్త ప్రపంచ కల్యాణదాయకుడైన- శ్రీజనార్దన భగవానుడు ఇతోధికమైన కార్య సాధనలకై సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్య అనుకూల అభివృద్ధుల నందించు గాక.

సరసులూ- సహృదయులూ- రసజ్ఞులూ ఐన పాఠకులు- ఏవేని తగిన సూచన లొసంగిన మలి ముద్రణలో సరి జేసి కొనగలము.

శ్రీ భూ దేవి సమాయుక్త ముగ్ధ మోహన మూర్తయే
శ్రీ జనార్దన రూపాయ వాసుదేవాయ మంగళం.

ఇట్లు
బుధజన విధేయుడు
వేదాల వేంకటప్పలాచార్య
"సాహిత్యరత్న"
తాలూకా జూనియర్ కళాశాల (తెనాలి)

# కృతజ్ఞత

దేవాదాయ ధర్మాదాయ శాఖవారు క్రీ.శ. 1970 మే నెలలో నన్ను మా కర్లపాలెం జనార్దనస్వామి వారి దేవస్థానమునకు మేనేజింగ్ ట్రస్టీగా నియమించి నప్పుడు చాలా భయపడ్డాను ఇంతటి మహత్తర మైన బాధ్యత నేను నిర్వహించ గలనా ? అని-దేవస్థానమునకు గల ఆదాయమా ? చాలా స్వల్పం-ప్రస్తుత దేవస్థానమా ? చాలాశిధిలావస్థలో నున్నది. నేనేమి కార్యక్రమం సాగించగలనని? పలువిధాలుగా కొట్టు మిట్టాడాను-కాని త్వరలోనే మా పాలకవర్గ సోదర సభ్యులందరూ నాకు బహుముఖంగా ఉత్తేజాన్ని ఉద్రేకాన్ని కలిగిస్తూ సంపూర్ణముగా సహకరించారు. మా కర్లపాలెంలోని పదునెనిమిది పాలెముల ప్రజానీకం సమస్తం నాకు వెన్నండగా నిలచింది. నాలో ఉత్సాహం ద్విగుణీ కృతమైంది-దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమం సాగించాము. దేవస్థాన నిత్యపూజా విధానాదికములలోనే గాక- నిత్యోత్సవ వారోత్సవ మాసోత్సవ కల్యాణోత్సవాదులను ప్రత్యేకముగా పండుగలకు జరుగవలసిన మహోత్సవములను-సక్రమంగా జరిపించ ప్రయత్నించాము. యాగశాల గీతాశాల వాహనశాలలే గాక-ప్రహరీ సింహద్వారము-శిధిలావస్థ లోనున్న వాహనములు విమానం బాగుసేత ఎన్నో కార్యక్రమాలు చేపట్టాము భగవద్విషయ కార్యక్రమములకు వీలుగా శ్రీజనార్దన కళాపీఠం- నిర్మింప జేశాము- తిరుమల తిరుపతి దేవస్థానంవారి సహాయంతో "మైకు" సంపాదించి భక్తి సంబంధమైన రికార్డులతో నిత్యం ఉదయము సాయంత్రము ప్రజలకు మనోరంజనం కలిగింప జేస్తున్నాము- స్వామివారికి సర్వాంగాభరణాలు-ప్రసన్నాంజనేయుల వారికి సర్వాంగాలు ఛత్రచామరాదులు సమకూర్చాము-నూతన ఉత్సవ విగ్రహముల పంచమ బేరములుగా సాధించాము ఈ విధంగా మాగ్రామ ప్రజల సహాయ సహకార సంపత్తులలో అనేకమైన

నూతన నిర్మాణ కార్యక్రమాలు మా పాలక వర్గం సాగిస్తున్నది. "ఈ మా గ్రామ క్షేత్ర మాహాత్మ్యం" మా దేవాలయార్చక స్వాములైన శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్యులవారు క్రీ.శ.పదునెనిమిదవ శతాబ్దంలో రచించి నారని తెలిసికొని దాని నెలాగైనా వెలుగు లోనికి తేవలయునని దృఢ సంకల్పంతో ఆ గ్రంథం కోసంగాలించి చివరకు క్రిమిదష్టమైన ఒకానొక జీర్ణ ప్రతిని సాధించి దానికి అనురూపకల్పనకై 'తాలూకా జూనియర్ కళాశాల' (తెనాలి) లో హిందీ పండితులుగానున్న వేదాల వేంకటప్పలాచార్యులగారిని అర్థించాము ప్రప్రథమంగా మా కోరిక విని వారు చాలాభయపడ్డారు- కాని మేము పట్టుబట్టి బలవంతం చేయగా "సరే" నన్నారు.

నాలుగునెలల సాధనానంతరం శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్యులవారి శ్రీజనార్దనాభ్యుదయ (కర్లపాలెం క్షేత్ర మహాత్మ్యం)మునకు సమగ్ర రూప కల్పనతో కావ్యం మాకందించారు. వారు నేనుకలసి పండితశేఖరులు-ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ నారాయణం రఘునాధ చక్రవర్తి భట్టా చార్యులవారిని- మధురకవి శ్రీమాన్ బృందావనం రంగాచార్యుల గారిని కలుసుకొని వారి "చక్షురక్షర సంయోగ సౌజన్యములతో" సమగ్రపరిశీలనా సౌలభ్యములతో "ఆమోద ముద్ర" వేయించు కున్నాం-ఇంకా చాలా మంది కవి పండిత శేఖరుల సలహాలను గూడా సేకరించాం- ఇక ఈకావ్యం ఎలా వెలుగులోనికి రావాలి?- దీని ముద్రణా కార్యాక్రమం ఎలా జరగాలి? అన్నది నాకు చాలా బలీయమైన కోరికగా తయారైంది మాదేవస్థానపు ఆదాయమా. బహుస్వల్పం-గ్రంధముద్రణమా ? వేలతోగూడిపని-నేనా ! సామాన్యుడను ఏమా ? అనిఆలోచించి ప్రస్తుతం బాపట్ల ఏరియా దేవాదాయ ధర్మాదాయ శాఖ అసిస్టెంట్ కమీషనర్గారైన శ్రీపగిడాల వేంకటరంగనాయుడు B.A. గారికి నామనస్సులోని ఆవేదన విన్నవించాను- పరమ దయామయులైన వారు వెంటనే నామనస్సులోని ఆవేదన అర్థంచేసుకున్నారు-తమ పాలనలో

గల కొన్ని దేవాలయములకు- కర్లపాలెం క్షేత్రమాహాత్మ్య ప్రకాశనకు ధన సహాయం చేయవలసినదిగా ఆదేశాలు పంపుతూ నాకొక ఆర్డరు గూడా దయ చేశారు. వారి ఆదేశం సఫలమైంది. ఇంకా మా గ్రామస్థులు గూడా నాకు బాగా ఉత్సాహాన్ని కలిగించారు- దేవాదాయ ధర్మాదాయశాఖ వారి సహకారంతో ఈ గ్రంధం ఈ విధంగా ముద్రణకు నోచుకొని మా కర్ల పాలెం ప్రాంత ప్రజలలో బృందావనంలా వెల్లివిరిసింది.

ఈ ముద్రణలో మాకు సంపూర్ణంగా సహకరించి చక్కని గెటప్‌తో స్వల్ప వ్యవధిలో ముచ్చటగా ముద్రించి యిచ్చిన శ్రీ పసుపులేటి గోవిందరావుగారు (సూర్యా ప్రెస్) ఎంతో అభినందనీయులు.

ఆంధ్రప్రభుత్వ ఆస్థాన కవులూ, జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలు- పద్మభూషణ, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ M. A. గారిని— దర్శనాచార్య - మహోపాధ్యాయ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గారిని- కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారిని - మధురకవి శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు గారిని- పౌరాణికశేఖరులు శ్రీ చావలి వామన మూర్తిశాస్త్రిగారిని-పండితవరేణ్యులు శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని సహజ కవులు- శ్రీబొడ్డుపల్లి పురుషోత్తం M.A.,Ph.D. గారిని- మాకు అత్యంత ఆప్తులూ- మా శ్రేయోదాయకులూ ఐన శ్రీమాన్ నారాయణం రఘునాథ చక్రవర్తి భట్టాచార్యులుగారిని ప్రత్యేకించి కలుసుకున్నాం-వారం దరూ ఏకకంఠంతో ఈ కావ్యమును అభినందించుటయే గాక మా కృషిని ప్రశంసిస్తూ మమ్మ దీవిస్తూ వారివారి అమూల్యమైన అభిప్రాయములు గూడ అందించారు- వారికి మేమెలా కృతజ్ఞతలు చెప్పుకొనవలయునో? వారికి మా దేవస్థానపు పాలక వర్గం తరపున మా గ్రామ ప్రజల తరపున మా కర్ల పాలెం క్షేత్రమాహాత్మ్య రచయిత లైన కీర్తిశేషులు శ్రీమాన్ బృందావనం

లక్ష్మణాచార్యులగారి తరపున కృతజ్ఞతా పూర్వక సుమనోంజలులతో ధన్య వాదము లర్పించుచున్నాము.

ప్రత్యేకమైన అభిమానముతో మమ్ము కరుణించి తాము అఖండ పర్యటనా కార్యక్రమములలోనున్ననూ- ఈ కావ్యమునకు- తమ అపూర్వ "మంగళాశాసన"మనుగ్రహించిన- పెదముత్తేవి శ్రీకృష్ణాశ్రమస్థాపకులు-ముముక్షుజనపీఠాధిపతులు-శ్రీశ్రీశ్రీలక్ష్మణయతీంద్రుల వారికి-మా దేవస్థాన వర్గమే గాక మా ప్రాంత మంతయూ భక్తిరసనిర్భర చేతస్కులై నమస్కరింపుచున్నది.

నా యీ కార్య క్రమమునకు అన్ని విధములా సహకరించిన వేదాల వేంకటప్పలాచార్యులగారికి కూడా కృత జ్ఞత వెలుపుట నా విధి—

ఇంకా ఎందరో మా గ్రామస్థులు మిత్రులు సానుభూతిపరులు సహాయకులు భక్తులు నా యీ కార్యక్రమమునకు అనేక విధములుగా నాకు చేయూత నిచ్చారు వారందరికీ నా అభిమాన పురస్సరాభివాదములు.

ఇక నాకు అన్ని విధాలా చేదోడు వాదోడుగా నుంటూ నాప్రతి కార్యక్రమమునకు తమ అఖండ అభిమానముతో ఆదరించుచున్న మా దేవస్థాన పాలకవర్గ సభ్యులకు నాహృదయపూర్వక ధన్యవాదములు.

మా యీ క్షేత్ర మాహాత్మ్య ప్రకాశనకై సంపూర్ణ సహకార మిచ్చిన ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖ వారికి మా యీ కర్లపాలెం క్షేత్రమునందలి పదునెనిమిది పాలెములూ అఖండానందముతో - అద్భుతాదరాభిమానములతో తలవంచి పులకించుచున్నవి.

ఎంతకెంతగా జాగ్రుతి వహించిననూ ముద్రణలో అచ్చటచ్చట అచ్చు తప్పులుండుట సహజము ఇది కాదన లేని నగ్న సత్యము-కాన సహృద

యులు రసజ్ఞులు ఐన పాఠకులు. గ్రహించి. మన్నించి మమ్మాదరించి తెలియ పరచి నచో ఈసారి ముద్రణలో తప్పక సరిచేసి కొనగలము. మీ ఆదరాభిమాన ములే గదా ! మాకు అన్ని విధముల ప్రగతి కారకములు.

ఈ జనార్ధనాభ్యుదయ కావ్యావిష్కరణ మహోత్సవ సమయంలో గుంటూరు జిల్లాలోని మహోత్తమ కవుల రావించి భువన విజయ సభా కార్యక్రమం నిర్వహింపవలయునని మాగ్రామ ప్రజల ప్రగాఢమైన ఆకాంక్ష. దీనికి దేవాదాయ ధర్మాదాయ శాఖ వారి సహాయము గూడా లభించగలదని మా సంపూర్ణ విశ్వాసము—

ఇంకా మా యీ శ్రీ జనార్దనస్వామివారి దేవస్థాన సర్వతోముఖ వికాసాభి వృద్ధి కార్యక్రమములకు మా గ్రామ ప్రజలందరూ నాకు ఇతోధిక ధైర్యో త్సాహములు గలిగింప గలరని సహకరించి సాధింప జేయ గలరని నమ్ము చున్నాను—

సర్వదా-సర్వధా-మీసహకార సౌలభ్యము లాశించు—

విధేయుడు

గుంటూరు అప్పలాచార్యులు

(మేనేజింగ్ ట్రష్టి) శ్రీజనార్దనస్వామి దేవస్థానం, కర్లపాలెం.



ఓం

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ జనార్దనాభ్యుదయము

## (ప్రథమాశ్వాసము)

శ్రీ వరయూరిదేవి తనచెక్కుల జేర్చు జవాజి గంధపుఁ
దావుల నీను మోవిని సుధాప్రతిమానము గాగ నానుచో
దేవర లిక్షుసారమున దెచ్చి "త్రుటీరజ"ముంచ భోగ్యమే!
నాపుడు శ్రీ రసోక్తులకు నవ్వెడి 'రంగపతిఁ' దలంచెదన్.

అనుకంపామతి దాల్చి శ్రీహరికి సర్వాత్మావన ఖ్యాతి దా
నొన గూర్పంగ దలంచి ఘోరతర పాపాస్మాలసప్రాప్తి-చే
తన వర్గమ్మున కాచరించి విభుచేతన్ బ్రోపగా జేయు మ
జ్జననీ రత్నమనంగు నొప్పు "సరసీజాతాలయన్" గొల్చెదన్.

సల్లలితేంద్ర నీలముల చాయ నదల్చి విదల్చ జాలు ధ
మ్మిల్లము జేర్చు మాల్యముల మేలుగ శ్రీహరి కిచ్చి లోకముల్
పల్లవితానురాగముల భాతిగనన్ గనుగ్రేవ జూచు మా
తల్లిని "భట్టనాథసుత" దల్చెద మాటి కభీష్టసిద్ధికిన్.

హరికి-నివాసమై-శయనమై-యుపధానమునై-ధరింప నం
బరమయి-పీఠమై-సుమహాపాదుకలై-విశదాతపత్రమై-
బరగుచు సర్వదాస్యముల బొల్పడి సేయుచు "సర్వశేషికిన్"
నిరతము శేషమైన "ఫణినేత" ననంతు నుతింతు నెప్పుడున్.

వేడుక మీరగొల్చెదను-విష్ణుని వ్రేల తదాజ్ఞ విశ్వమున్
బోడిమి మై సృజింప-దగ్గ్రోవ-హరింపగ-వేత్ర బూనుకొ
న్నాడన స్వర్ణవేత్రము ఘనంబుగ దాల్చి వికుంఠసేన గా
పాడెడి నీలగాత్రు-నుతిపాత్రుని-సూత్రవతీ కళత్రునిన్.

దురమున రాక్షసాంతకుని దోర్యుగపీఠి వహించి మించి బం
ధురతరపక్షసంహతుల-త్రోటిని-పావములన్-బలాధికా
శరఖలులన్ వధించుటకు సాగి రమాధవు చే బహూకృతుల్
కరమరుదార గాంచెడు నఖండుని గొల్చెద "వైనతేయునిన్".

చందన కుందహార మహాచంద్ర సుధా ధవళాంగ రమ్య మిం
పొందగ నల్వ వ్రేల చెలువొప్ప విపంచిని గోటమీటు నా
నందము గాగ కంకణ ఝణంకృత నాదము లుల్లసిల్లు వా
ణీం"దలిరాకుబోణి హరినీలసువేణి-మదిన్ దలంచెదన్.

దీన శరణ్యుఁడైన వసుదేవ కుమారుని యాజ్ఞ యౌదలన్
బూని చతుర్ముఖుండు తనబుద్ధిని లెస్స మథించు వేళ త
న్మానస జాతుడై పాదమె-మాపతిచే నుపదిష్టుఁడైన వై
ఖానస సూత్ర కర్త" నరిగర్వ విహర్త-వలంతు నెమ్మదిన్.

ధీరులను-వైష్ణవమతా
ధారులను-సదూర్ధ్వపుండ్రధారులను-సదా
చారులను-వళిత కుమత వి
కారులను-"శఠారి భాష్యకారుల" నెంతున్.

వర భారద్వాజాన్వయ
శరధి రమావరజు-సుగుణ సంపదలను దా
శరధి కవరజుండగు "దా
శరథావరజార్య" వర్యు సన్నుతిసేతున్,

ఈ సకలాత్మవర్గ మతి హేయ దురంత భవాబ్ధి దాటగా
బాసట లేక కష్టముల బాల్పడి యుండ మహానుభావతన్
శ్రీ సహచర్య పాదయుగ సీమను జేరుచు "శ్రీపరాశర
వ్యాస మహర్షి పుంగవుల"వారక గొల్తు నభీష్టసిద్ధికై.

ఎచ్చట రామ సత్కథల నింపు దలిర్పగ బాడ భక్తి చే
నచ్చట మోడ్పుకేలు శిరమందు ఘటించి ముదశ్రునేత్రుడై
సచ్చరితానువర్తనము సల్పు మహాత్ముని "వాయుసూను" శ్రీ
మచ్చరణారవిందముల మాటికి దల్తు నభీష్టసిద్ధికిన్.

చంప మెరుగు-బంద మెరుగు-
కంద మెరుగు-నందమెరుగు-కందము దెలిపే
సుందర కృతి మందరుల ద
గం దలచెద "నన్నయాది" కవి శేఖరులన్.

మొదల నుండి మధురముగ బల్కుచుండెడి
శుక వితతుల నొప్పు సుకవి తతులు
ఆది నుండి కారులాడుచు నుండెడి
కాక వితతు లటుల కా కవితతి.

ఏ! వేల్పు! పాదరాజీవంబు జీవమై
బ్రతికించె గౌతమ పత్ని మున్ను
ఏ! మహామహుని! విహిత బాహుబల మోలి
యోలిగా నయ్యె సీతా లలామ

అరయ ! నెవ్వాని దివ్యాంగ లావణ్యమ్ము
గాంచి మౌనులు గోపకాంత లైరి ?
ఏ ! రమ్యు ! నామమ్ము తారక నామమై
సంతతము జపించు శంకరుండు
రమణి నే దేవమణికి శ్రీరంగభర్త
కులధనం బయి పూజల కొమరు మిగిలె ?
అట్టి రఘుకుల భద్రుడై నట్టి-రామ
భద్రు, భూపుత్రి, లక్ష్మణ ప్రథితు, దలతు.

పాదాంగుష్టము నోట మందు నిడి తేవ న్మోడ్పు కందోయి సు
స్వాదానంద రసైక భోగ్య గతి దెల్పన్-పారమైకాంతి కృ
ద్వేదానూన విశేష గాన మటు లాభీరాంగనా గీతికా
నాదంబుల్ విను "బాలకృష్ణుని" మనోనాళీకమున్ జేర్చెదన్.

అని ఇట్లు ఇష్టదేవతా ప్రార్థనమ్మును, అనంత గరుడ విష్వక్సేనాది వందనమ్మును, మహర్షి నమస్కారమ్మును, సుకవి పురస్కారమ్మును, కుకవి తిరస్కారమ్మును, నొనర్చి సకల పుణ్య ప్రసాదోదయం బగు "శ్రీజనార్దనాభ్యుదయ" మ్మను నొక పుణ్య కథా ప్రారంభమ్ము గావించు కుతూహల మానసుండనై యున్న తరి, నొకానొక పున్నమ రేయి చతుర్థ యామమ్మున.

రాకా సుధాంశు నిరాకరించెడి మోము

డంబుతో-మణికిరీటంబు తోడ-

తన కంజరాగ సత్ప్రపచ ప్రభూషి తాం

గంబుతో-సానురాగంబు తోడ-

భాను కోటి ప్రభా భాసిత రత్న హా

రాళితో-నీలాల కాళి తోడ-

కరుణా రసము లీన గల నను క్రేగంటి

చూపుతో-నెద సిరి రూపు తోడ-

మొలక వెన్నెల నగు నవ్వు మురువు తోడ-

జిలుగు బంగారు మేలి దువ్వలువ తోడ-

కుండలీంద్రుని శయ్య బరుండి-నాదు

కలను "మేలివ్వ" గల నంచు గాన్పించి.

ఏను శ్రీరంగ నాధుండ-నీవు జేయ

బూను కొనిన "జనార్ధనాభ్యుదయ" మస్మ

దంకిత మొనర్చు- "మంత్రరత్నార్థ" మీవు

ఘనత సేవించుటకు సార్ధకంబు గాగ.

అని పలికిన యద్దేవుని
ఘన మధురోక్తులకు తృప్తి గాంచిన డెందం
బున-నాదు "భాగ్యగరిమన్"
గొనియాడుచు మోదమెసగ గూర్చితిని కృతిన్.



# షష్ఠ్యంతములు

శంతన రాజ్మంటప ముకు
రాంతః ప్రతిఫలిత మోహనాకారునకుఀ-
కాంతా దృక్కుముద నిశా
కాంత ప్రతిమాన నిజముఖ సుసారునకుఀ-.

గణనాతీత సుగుణ గణ
మణికిని- దినమణీ విరాజమాన మకుట స
ద్మణికిని- వితరణ చింతా
మణికి- మహద్వస్తు దీప్యమాన విపణికిఀ-.

చైత్రోత్సవ సేవా గత
సుత్రామాద్యఖిల విబుధ సోమార్చిత స్వ
ర్ధాత్రీ రుట్సుమ పరిమళ
పాత్రాంఘ్రిద్వయ వినమ్ర భక్తావళికిఀ.

కరుణా వరుణాలయునకు-
చిరతర శీతల కటాక్ష జిత మలయునకు౯-
సురుచిర మణి వలయునకు౯-
సరసీరుహ ముకుళ సదృశ సన్నిలయునకు౯.

విబుధాచల ధృతికి- యశః
కబళిత దిక్తతికి-కనక కవచ మణీ విభా
శబలిత దివ్య వధూ జన
కబరీ శ్రితతికి- రంగ కమలా పతికి౯-



# కథా ప్రారంభము

సమర్పితంబుగా నా యొనర్పం బూనిన " జనార్ధనాభ్యుదయం "
బునకు కథాక్రమం బెట్టి దనిన ?—

"నైమిశారణ్యము"నకు శౌనక మహా ము
నీంద్రు డాది గాగల మౌని చంద్రు లెల్ల
"సత్రయాగమ్ము" సేయుచో-"శౌరి" సత్క
థా సుథా రస మందున దనివి సనక.

సూతుఁ- బ్రహ్మనందో
పేతుఁ- నిగమార్ధ తత్వ భేదాభేద
ఖ్యాత పురాణ కథా వ్యా
ఖ్యాతుఁ- గని పలికి-రధిక కౌతూహలులై.

తాపస వర్య!- నీదు ముఖతామరస చ్యుత విష్ణు సత్కథా
లాప మరంద సార మవిలంబన గ్రోలగ గ్రోలి-నెమ్మియుం
బాపురె ? మన్మనో భ్రమర పంక్తికి బాయదు "తృష్ణ" గావునఁ
శ్రీపతి పుణ్య కీర్తనలుజెప్పి "కృతార్థు"ల జేయువే! యనఁ.

అనిన సూతుం డిట్లనియె.

ఏ పుర వాసిత్వ? మిహ లోక కృత తప
స్సత్యాది ధర్మ సంచయ ఫలంబు-
ఏ పౌరు? లర్చింతు రిందిరేశుని మనః
కాసార సౌవర్ణ కమలములను-
ఏందున్న జను? లరవింద సంభవు సభ
విందు రా సూ లోక వృత్తములను-
ఏ యూరి వారు? మోమెత్తి కాంతురు హరి
పదమున కేగు సద్భక్త వరుల-
ఎచట? బంగారు గణులచే నింపు మీరు
నంచ బోదల బెంచుదు రించుబోంట్లు-
ఏది సర్వోన్నతంబయి నెసగు?- నదియె
పరమ లక్ష్మీకరము "విధిపురము" వరము.

అందు సహస్ర సహస్ర మయూఖ మయూఖ విబాధః కృతానేక వజ్ర స్తంభ శోభితంబును, కాంచన పట్టాంబర వితాన లంబమాన ముక్తాఫల గుచ్ఛాచ్ఛ చ్ఛవిచ్ఛటాచ్ఛాదిత దిశా వలయంబును, పద్మరాగేష్టికా పరికల్పిత భిత్తి దేశ విలిఖిత నారాయణ దశావతా రాకార భాసురంబును; విబుధాచల విధూపల విభా మిళ స్థళాంచితంబును,-హరినీలమణి జాల సోపాన విరాజితంబును, మకర తోరణాంచితంబై కాంతులమించు-

నొక సభామంటప మధ్యంబున- కశ్య పాత్రి భరద్వాజ విశ్వామిత్ర వశిష్ఠ జమదగ్ని కణ్వ జాబాలి కుత్స వత్స భృగు మరీచి వైఖానస వాలఖిల్య మంకణ మార్కండేయ సనక సనందన సనత్సుజాత సనత్కుమార కపిల కలశజ గౌతమ గార్గేయ దళాద పిప్పలాద వాల్మీకి సౌబరి పారాశర్యాది మహా మునులు పరివేష్ఠింప-గాయత్రి సావిత్రు లిరుగడల కంకణ ఝణఝణత్కార కలితంబగు చామరంబుల వీవ- ఝంభత్కళా రంభా ద్యప్సరస లంభోజసంభవుని పై గుంభన పదముల నభినయింప, చేతన్ విపంచి వ్రాతంబు లూని గీత జాతంబుల గంధర్వు లాతరిం బాడ-జాతరూప మయ కంజాత పీఠంబున పలుకుల చెలువ చెలువుం డగు నలువ గొలువై యున్న సమయంబున-

పలుకెంపు నాడెంపు పవడంపు పసనింపు
నసుపింపు జడల సొంపమర దాల్చి
కళదేలు తెలి చాల్తిగల గీలుకొన గ్రాలు
పులితోలు చంక నేర్పున ఘటించి
కమలాక్ష నామాక్షరము లేకఋము దీక్ష
నెన్ను పద్మాక్షల నెవ నమర్చి
జగమందు సరినొందు తొగవిందు జతనొందు
మొగమందు మృత్పుండ్రమును ధరించి.

మహతి యను వీణ మొరయ- చామరము మెరయ
కక్షపాల భుజాగ్ర భాగమున వ్రేల
నెచటి నుండియొ! వచ్చె తా నచటి కపుడు
"నారదుం డాత్మ విద్యా విశారదుండు-

వచ్చి "మహద్భ్యః నమ" యన-
నచ్చటి ముని లద్భుతంబు నంపగ మ్రొక్కన్
గ్రచ్చున పరహాసమ్మున
విచ్చేసెను -కమలభవుడు వేడుక ననియెన్.

అన్నా! నారద! యెట జని
యున్నాడవు? నచట నచట నుర్వీ జనముల్
మన్నారే కద? శ్రీభగ
వన్నారాయణ పదాబ్జ భక్తి ప్రియులై? -

అని యడిగిన కమలాసనునకు కలహాశనుం డిట్లనియె-

ఓ చతురాస్య! నేను కలశోదధికిన్ జని- యందు- శ్రీపతిన్
జూచితి -చిల్వరేని పయి సొంపెసగన్ బవళించి వేడుకన్
జాచిన పాద పద్మముల సన్నిధి నుండి రమావధూటియున్
బూచిన తంగెడు న్వలెను బొల్పుగ పాదము లొత్తు చుండగన్-

సాష్టాంగం బొనరించితి-
దుష్టుల చే బాధ లెల్ల దొలగి శుభాప్తిన్
శిష్ట జను లాదిగా గల
సృష్టిన్ మానవులు ముదము జెంది సుఖింపన్-

వనమాలీ ! పనివిని ఏమెద
నినుగంటీ-కృతార్థ భావ నిధి నైతి గదా !
విన నేమున్నది? సర్వము
గను చుండెద !; నీ కృపాప్తి-కమలాక్ష ! హరీ !

అని విన్నవించి

సుడిసి బండెడుత్రాడు ముడిగొన నందని
పెడమ్రాకు లుండు కారడవు లనక-
చండ భానుని రథకాండ ఖురాంకిత
గండశైలము లుండు కొండ లనక-
బహు వేగమున మహా మహులు స్వర్గతి కేగి
మహికి వచ్చెడి పెద్ద గుహల ననక
గట్టిగా లంబిక బట్టి బిగించెడి
యట్ట యోగులు గల పుట్ట లనక

తిరిగి తిరిగి మహ ద్దివ్య దేశములకు
నరిగి యరిగి తదుత్స్మృతి కెరగి యొరగి
హరి కథామృత మున మది కరగి కరగి
యరిగితిని "తుంగభద్రా ఘ్యా ఝరికి దరికి

మెల్లన పాదము లిడుచును
జల్లించిన కూర్మి తోడ జని గనుగొంటిఁ
పల్లవ కుట్మల ఫల భరి
తోల్లస దారామ భూము! లుత్సవ మొప్పఁ.

అచ్చట

గంటకాగెడు నయ్యు దంట వెన్నల నిండి
కుంట పుట్టెడు పండు పంటచేలు
చందమామ ను బోలు నందంపు మైదాలు
బిందె పాల్గల యాలమంద చాలు
పెల్లాటలను కేకులెల్ల నానందించు
బలుమొగుళ్లన మించు బలు మొగళ్లు
తాళంబు- లధిక హింతాళంబులును- నారి
కేళంబు"- లమిత సీతాళ ములును.

లల వాకిటను బ్రాంచితామృతమ్మున మించి
నిర్మల మ్మగు మంచినీళ్ల బావు -
లెమ్మి కమ్మని తావి గ్రమ్మి తుమ్మెదల నా
దమ్ముల రహి మించు తమ్మి కొలకు-
లమరి యమరీ జనంబులకు మరు లొంద
కొమరు ప్రాయంబు నను వేద మమర జదివి
కొమరులను గాంచి సద్వృత్తి నమర వరుల
మరియు మెప్పించ దగు ధరాసురుల గంటి-

లేడి పిల్లల గుంపు గూడి మెల్లన తల
పేలు జూచుచు నున్న పెద్దపులులు-
చంగలేనుగు గున్నలం గని మైగోకి
పొంగి యాటల నాడు సింగములును-
గొరియ గుంపుల మూగి కొను దోమలను దోలి
హాయి గావించు నీహామృగములు-
తల్లి యొల్లక యున్న పిల్లికూనల దయ
గూడి పాలిచ్చెడి కుర్కురములు-

4)

కలిగి-తమజాతి వైరముల్ దొలగి-కలసి
మెలసి విహరించు మృగముల వలన చెలగి
మెలగి చూడ్కుల కానందములు ఘటించు-
మౌని పుణ్యాశ్రమముల నెన్నేని గంటి-

బొటన వ్రేలొక్క టీ భూమిపై నానించి
నెరి నూర్ధ్వ బాహులై నిలచు వారు-
అతి వేండ్ర మునను పంచాగ్ని మధ్యమ్మున
నుగ్ర తపో వృత్తి నుండు వారు-
మహిత కుంభక యోగ మహిమా ప్రదీప్తి చే
మించి పై పై కుద్గ మించు వారు-
తలక్రిందు గా బాదములు మిన్నునకు సాచి
పలు వత్సరమ్ములు బ్రతుకు వారు
పల్లజడ లిల బూది రంజిల్లు వారు
చండ కిరణు నిరీక్షించు చుండు వారు
ఫాలమున గోపి చందన శ్రీల వారు
తమ్మి పూసల పేరుల దాల్చు వారు

గలిగి "ఋషికనాట" మొక్కటి గానుపింప
నిరూపమానందమున నిట్టి పరమ యోగి
వరుల కిరవైన యీ భూ నివాస మెంత ?
పాప హర మంచు ? నివ్వెరపాటు తోడ-

అచట ద్రిమ్మరు చుండ దివ్యాలయమ్ము
కనుల విందయి యొక్కటి గానుపింప-
గాంచి-"వైఖానసాగమ" క్రమ విధిజ్ఞు
లర్చనా విధు లొనరించు నట్టి వేళ-

మాణిక్య సత్ప్రభా మణి కిరీటము వాని-
కమల రాగ సుకుండలముల వాని-
కంజాతముల నేల గల కన్నుగవ వాని-
మొలక వెన్నెల నగుమోము వాని-
కంబు సౌందర్య మంగళ గళ శ్రీవాని
బింబికా ఫల సమోష్ఠంబు వాని-
తార హారోజ్జ్వల చారు వక్షము వాని
గ్రమ్ము వాసన బొడ్డు తమ్మి వాని-

డంబమరు చున్న దోశ్చతుష్కంబు వాని-
కుమతుల జయించు పంచాయుధముల వాని-
రమ్యతర చారు పీతాంబరమ్ము వాని-
గాంచితి "జనార్దనుని" నాదు కన్నులలర.

కాంచన శైల విస్ఫురణ గాంచి వినమ్రత భక్తి నొంది పూ
ర్ణాంచిత చిత్తుడై వికసవంబుజ నేత్ర యుగంబు రాఘవో
దంచిత మూర్తి దర్శనము నందగ బాష్పము లూర నంజలిన్
మించిన-"నంజనీ సుతుని" మేకొని వేడుక గాంచి తచ్చటన్.

ఏమిటి; కందు శ్రీహరి వసించె? రమా ధరణీ సమేతుడై-
శ్రీమహితుల్ సమస్త ముని శేఖరు లెందుల కందు నుండి? రా
భూమి తృణాంబు సస్య పరిపూరిత మై వెలయుం బనేమి? యో
తామర చూలి! తెల్పగదె! తామర సాక్షు కథల్ సుధోక్తులన్.

దేవ! నీ కృప నొక్కింత దివ్య బోధ
దెలిసియును - తావ కోక్తుల దెలియ గోరి
వచ్చినాడను- తండ్రులు వారి వారి
సుతుల కోర్కెల నీడేర్ప చోద్యమగునె?

అని యడిగిన దేవమునికి దేవ జ్యేష్ఠుం డిట్లనియె.

వత్తురు సర్వ లోక జన వంద్యులు నై దనరారు మౌను-ల
త్యుత్తమకర్మఠుల్-బుధులు-యోగులు-శాంతులునిర్జితేంద్రియుల్
చిత్త విరక్త-లూర్జితులు-జెన్నుగ నీ వలె ప్రశ్న వేయరో
విత్తమ! మేలు మేలు పదివేలు గదా! వివరింతు నారదా.

శ్రీ రమ్యమ్మగు దివ్య భూజముల చే జెన్నొందు సారస్వతీ
తీర క్ష్మాస్థలి నొక్క నాడు "మును" లెంతే వేడుకన్ గూడి యీ
నీరేజాండము లన్ సృజించ గను-మన్నించంగ-ద్రుంపన్-మహా-
వీరుం డెవ్వడు? సర్వ కారణుడు! సేవింపం దగున్! వానినిన్.

వేదముల-శాస్త్రముల-మత
భేదములను-వాదములను-పెడయుక్తుల చే-
నా దేవుని గన జాలము
యాది మహా కారణమ్ము లరయుట యెట్లో?

అని వితర్కింపుచు.

"అణు" వని కొంద రన్న-నటు లాడగ రాదు-పరేశు డంతకు-
"న్నణు" వని కొందరున్ బలుక-నట్లన జెల్ల-దధీశు డెన్న "ని
ర్గుణు" డని కొంద రొక్కటను గూడి వచింపగ- కొంద రందు "స
ద్గుణు"డని వేరు వేర "పరు గూర్చి" వివాదము లాడు చుండగన్

హరి "ఈశు" డని పల్కు నతడు గాడుహరుండు-
నతడు గా డబ్జజుం డతడు గాడు-
హరి హయుం డతడు గా డబ్జ మిత్రుడు చూడ-
నతడు గా డబ్జారి యతడు గాడు-
వీతి హోత్రుం డని వివరింప నతడు గా-
డనిలుం డటని జెప్ప నతడు గాడు-
విఘ్నేశు డని చెప్ప వెలయంగ నతడు గా-
డారుమోముల వేల్పు నతడు గాడు-
తానె దేవుం డటన్న ను తాను గాడు-
బట్టబయ లన్న నది గాదు-వట్టిమాట-
విశ్వమున వెల్గు వెలుగన్న వెలుగు గాదు-
కనుల కనరాని దని గాదు-కాదు కాదు.

ముగ్గురు వేల్పుల జెప్పగ
నెగ్గేమియు లేదు-జగము లెల్ల సృజింపన్
దగ్గరి పోషణ జేయన్
మ్రగ్గగ జేయంగ--నిల సమర్థులు గారే!

హరి హరులకు భేదం బా
పరమాణువు మాత్రమైన బరికింపకనే
గురి తప్పి బేధ మెంతురు
మరికొందరు యెరుక మాలి మనుజు లటంచున్.

వారికి వీరికి పరమై
ఘోరాకృతి తోడ "శక్తి" గొన కొని గోటన్
నారాయణ విధి శంభుల
నారయు బుట్టించె ననుచు నాడుదురు భువిన్.

ఇందు కెయ్యది సత్యంబు ? యేది ముఖ్య ?
మెవ్వ రెరుగుదు రీ నిజం ? బేది త్రోవ ?
కాన మన మందరము తత్వ కలిత వృత్తి
గాంచి లోకోపకారమ్ము గాగ నిపుడు.

నిత్యము మది భావించుట-
సత్యము వాక్కులను బలుకు సర్వ మసత్య-
మ్మత్యంతము "చకు ర్వై
సత్యమ్మ" ని శ్రుతుల యందు జాటగ వినమే !

కావున-నెవ్వ రే గతి బల్కినను "మువ్వ"
రధికులు దైవము లందు జూడ
ఆది గాక నబ్జ మిత్రాదులు "భీషాస్మ"
యను శ్రుతి బల్కు లోనైన వారు
వీరల మాని-యెవ్వారైన మనలోన
మూర్తి త్రయాంతిక మునకు నేగి
తామస-రాజస-తాత్పర్యములు మాని
శుద్ధ సత్వ శ్రీ ల సొంపెసంగి
యుండు "నాతండె"-పరమాత్మ-చండ కిరణు
నందు-జగమందు-సర్వంబు నందు-నిండి
యుండు తేజంబు వాని-ప్రయుక్తి గాంచి
వచ్చు వారెవ్వ ? రనెడి తాత్పర్యములను.



## మునులు భృగుమహర్షిని ప్రార్థించుట

భృగువు స్సని మే త్మేలని
భృగువు స్సను గొంద మిపుడు వేగమె జని యా
ముగు రందు శుద్ధ సాత్వికు
జగదీశుం డనుచు నెరిగి చయ్యన రావే.

అని ముని జనమ్ము లనేక విధమ్ముల ప్రార్థించిన, సమ్మోద భయభక్తులు హృదయాంబుజంబు నందు ముప్పిరి గొన భృగు మహర్షి యిట్లనియె.

ఏ నెచ్చట? మూర్తి త్రయ
మానస భావమ్ము లెరిగి మరలు టెచ్చట? యీ
పూనిక మా బోటులకుఁ
కానిది గద? యుష్మ "దాజ్ఞ" గడవగ వశమే?

అనుచు బల్కుచు భృగ్వర్షి "అమల బుద్ధి"
పరమ మునులార! మీరలు పలికి నట్టి
పనికి "పనివినియెద" నొండు బలుకరాదు-
నిరుపమాన కటాక్షమ్ము నిలుపు డనుచు.



# భృగుమహర్షి కైలాసమ్మున కేగుట

శంకరు గాంచె-సన్ముని వశంకరు-నద్రి కుమారికా మనః
పంకరుహాబ్జ మిత్రుడన భాసిలు దేహ రుచిఙ్ మృగాంకునిన్
వంకలు వెట్టుచున్ సుజన వాంఛితముల్ నెరవేర్చు పాప నా
శంకరు-భక్త మానస వశంకరు-పాద వినమ్ర శంకరుఙ్.

తల మీద గంగ జాలుఙ్-
పులి తోలున్మొలను- కేల ముమ్మొన వాలుఙ్-
వెలి బూది మేన బోలన్-
గలిగి జగం బేల జాలు -గరకంఠు-హరుఙ్.

తారక నామము సతి కిం
పారగ నుపదేశ మిచ్చు పార్వతి ధవునిన్
ధీరు- మృకండూద్భవునిన్
జేరంగా దీసి మనుచు-శివునిఙ్-భవునిఙ్.

కాంచి వాని యెదుట కదలక స్థాణువు
కరణి నున్న నపుడు "కాలకంఠు"-
డర్ఘ్య పాద్య విధుల నర్చింపగా సుప్ర
సన్న మతిని గొనక నున్న-వలిగి.

శూలము గైకొని వహ్ని
జ్వాలా కీలా కళ్లాళ్ల సంభ్రమ దలికా
భీలాంకుండై- లేవగ
శ్రీ లొనగెడి చూపు చూచి-"శివ" యిట్లనియెకా.

ఓ హెూహెూ ! తగునా ! భవాదృశుల కీ
యుత్సాహ పాండిత్య ? మా
హాహా ? వారిటు వచ్చు మేల్పనుల నూ
హకా గానగా లేక ధు
ర్మోహ మ్మూనుచు పైకి పైకి జని సా
ములే సేయగా వచ్చునే ?
సాహంకారము "చాలు చా" లుమనులపై
సాగింపగా రాదికకా

కోప మాపవయ్యా ! తాపస జనులకు
శాప మివ్వ నెవరి కోపరాద
టనిన "శంకరుం" డహంకార ముడిగి దా
శాంతి నొందె-మౌని చంద్రు డంత.



# భృగుమహర్షి వైకుంఠమున కేగుట

శ్రీ రమణీ విభుడు-దయా
వారాన్నిధి-యున్న క్షీర వారాన్నిధికిఁ
జేరెను శ్రీ వైకుంఠ పు
రీ రమ్య కళా ఝరీ నిరీక్షా పేక్షన్.

నారాయణా! దామోదర!
నీరజ దళనేత్ర! కృష్ణ! నీరద గాత్రా!
శ్రీరమ్య! సచ్చరిత్రా!
సార దయా పాత్ర! దాస సారస మిత్రా!

సాక్షాత్కరింప వయ్యా!
లక్షణ యుత వక్ష! పరమ లక్షణ రేఖా
లక్షిత పాదాంభోరుహ!
పక్షీశ్వర దివ్య వాహ! పన్నగ శయనా!
అని ప్రార్థించిన

వినుమా! నారద! యేమి జెప్పెదను! శ్రీ విష్ణుం డు-తా నెంత స
ద్ఘన కారుణ్య సముద్రు డో తెలియ-శ్రీ కాంతా లలామమ్ము తో-
వినతా నందను తో-వికుంఠ పురితో- విశ్వంభరఁ గూడి నొ
య్యన పంచాయుధ పంక్తి తో-నపుడు ప్రత్యక్షమ్ము గావించినఁ.

భావింవగా "వాసుదేవాత్పరంనాస్తి"
యని పల్కు శ్రీ శారికా వళియును-
సారెకు "శ్రీమతే నారాయణాయ న
మో"యని వాక్రుచ్చు కోయిలలును-
తలపగా "సర్వభూతాని విష్ణు ర్భువ
నాని"యనె హంస సంతానములును-
కేవలమును "హరిరేవజగత్తని"
భావింపు చుండెడి బంభరములు-
వరద ! శ్రీకృష్ణ ! గోవింద ! వనజ నయన !
పద్మనాభ ! దయానిధే ! పరమపురుష !
పాహి మా "పాహి మాం" మంచు పలుకు- శుక కు
లంబులను మించి సంప్రమోదంబు లొసగ.

మరకత శ్యామల మహితోజ్జ్వ లాంగులు
యసమాన దివ్య పీతాంబరులును-
ఘన చతుర్బాహులు- కంజాత దళ నేత్రు-
లరి దర శార్ఙ్గ దివ్యాయుధులును-
కంబు కంధరులు- శ్రీ కర తులసీ దళ
దామ విరాజి తోద్దామ గళులు-

భాసుర మృదు మందహాస లసన్ముఖాం
భోరుహ చ్ఛిద్రోర్ధ్వ పుండ్ర ధరులు
కటక కేయూర మకుట శ్రీ కలిత మేఖ
లాంగుళీయక కంఠికా హార నూపు
రాది భూషణ భూషితులై దనర్చి
పార్షదులు గొలువ వెలువొందు భవన మందు-

సూత్రవతీ శుభాసురవేత్ర శిఖర చా
లనమె యీ విశ్వ మెల్లను సృజింప-
చండాది హరి పార్శ్వ చరుల కన్బొమల సాం
జ్ఞ లె దిక్పతుల మది జంక జేయ-
ఇపు డపు డనక గావించు కైంకర్యమ్ము
టరిది ముక్తుల మేను లందగింప-
ఉచ్చైస్స్వరమ్ముల నూని జేసెడి సామ
గానమ్ము నిత్యుల కలిమి దెలుప-
భాసుర ఫణీంద్ర దివ్య ఫణా సహస్ర
మణి గణా లంకృత మ్మగు మంటప మున
శ్రీ రమా భూమి నీళలు జేరి గొలువ
యోగ నిద్రాప్తి బవళించి యున్న వాని-

కాంచి- యమ్మౌని చంద్రుడు-కమల భవుడు-
భవుడు-కనుగొన లేని శ్రీ ధవుని గంటి-
నహహ! నా పుణ్య మింక నెంతని వచింతు -
కంటిని కృతార్థ భావ సంగతిని మంటి.

అనుచు సన్మతి మ్రొక్కుచు నాతపస్వి
చయ్యనన్ జని శ్రీవరు సకల దివ్య
హార పరి శోభిత మ్మయి నట్టి యురము
పాదమున "దన్నె" జంకక భక్తి తోడ.

ఇట్లు దన్నిన పన్నగేంద్రుని పై నుండి విన్నబోని మనమ్మున సుప్రసన్నుండై చిన్ని యాతండు కొన్ని యాటలకు తిన్నెపై నుండి యురుకు వటుల గ్రన్నన నురికి, పున్నమ రేయిఁ దెగ గొన్న నగు మొగంబులును క్రొన్నన లనదగు చిన్ని యడుగులును మిన్న కెన యగు సన్నంపుగొమ తీగెలన్ యన్నులు గన్నన్ గవ గ్రేవల దన్నన్ జూడ, య త్తపస్వి వేల్పు నన్నిని కడకుం జని వెన్నుం డిట్లనియె-

అయ్యా! మిమ్ముల తోడి తెచ్చి వెరతో నర్ఘ్యమ్ము పాద్యమ్ము నే
నియ్యం జాలక మత్త చిత్తుని క్రియన్ హేలాగత జ్ఞాని నై
చేయ్యం బండిన తప్పు లో గొనక రోషం బీగి మన్నింపవే-
వెయ్యేలా! తమ దాస కోటుల కృపన్ వీక్షింపరే సజ్జనుల్-

ఖేదాపనోద ముద మా
పాదింపగ మమ్ము "దన్ని" పని గొనుట గడున్
మోదము గాదే ! నీ మృదు
పాదమ్ములు నొచ్చె ననుచు భావింతు మదిన్

ఈ గతిని బల్కి -నమ్మహా యోగి రాజ
కుంజరుని సాదరమ్మున గ్రుచ్చి యెత్తి
గౌరవింపుచు నొక్క బంగారు పీఠి
ఘనత గూర్చుండ బెట్టి సింగార మొప్ప.

ఘన మణీ స్థగిత సత్కనక భాజన మందు-
ముని చంద్రు శ్రీ పాదముల నమర్చి-
లలితోదకముల క్షాళనము గావించి త
త్తీర్థమ్ము శిరమున తెలివి దాల్చి-
తడి యొత్తి-విమల పద్మముల పూజ లొనర్చి-
చందన మలది పై శాల్వ గప్పి-
ధూప మర్పించి సర్వోపచారమ్ముల
వనితలు తాను నివాళు లిచ్చి -

6)

పంపిన మెుదర్చి వైవత వరులు దనకు
వేయు క్రియ సర్వమును జేసి-శ్రీ దనర్చి-
పక్ష కేర్కొత్తి నిలుచున్న పద్మ నాభు
గాంచి- భృగు మౌని నివ్వెర గదుర నుండి-

కంపిత గాత్రుడై-వెడప కన్నుల బాష్పము లుప్పతిల్ల గా-
పాంపిరి వోవ డగ్గుతిక - పాల్పెసగన్ బలుకంగ లేక పై
బింపుగ పుల్క లొప్పగ-హరీ! నను మన్నన జేసి గొప్పగా
పింపుట నాదు గర్వ మడగించుట గాదె! దయా పయోనిధీ!

నీ సౌలభ్యము -శాంతియు -
నీ సౌశీల్యమ్ము- నీ వినిర్మల దయయున్-
నీ సత్వము -నీ శమమును -
కాంతయు రాదు -కమల గర్భ- భవులకున్-

ఏ నెక్కడ! నీ వెక్కడ!
మా నాథా జూడ "హస్తి మశ కాంతర"మీ
హీనుడు -నిను గొనియాడం
గా నేర్చునె? బ్రోచి నన్ను గావవె- తండ్రీ!

రమానాథ! గోవింద! రామా! ముకుంద!
సుమాస్త్రారి వంద్య ప్రశుద్ధాంఘ్రిపద్మా!
క్షమా శాంతి వాత్సల్య సౌశీల్య సంప
త్క్రమానంద సంపన్న! కామా! మురారే! -

అని యనేక విధ ప్రణామమ్ము లాచరించి రమా నాయకా! సర్వ బ్రహ్మాండమ్ముల కందుక క్రీడ గావింపుచు నవబ్రహ్మలకు పరబ్రహ్మవై సృష్టి పూర్వంబున మాయా సుప్తులై శ్రీప్రోచ్ఛిష్ట గోళంబున నుండు సువర్ణ రేణువుల మాదిరి మాయాజాలమ్ముల మూలంజాలక నిరవయవములై యుండు జీవ తండమ్ముల కుచిత కళేబర ప్రదాతవై శీతల కటాక్షంబులన్ కటాక్షించి తత్కారణ కళేబరమ్ముల కుచితోపయోగమ్ము లగు శాస్త్రజ్ఞాన సంపదలన్ బొసఁగి గురూపదేశ పూర్వకమ్ముగా నజ్ఞానాంధకారమ్ము దొలగించు సుజ్ఞానమ్ము గల భక్తి యోగమ్ము చే భవదీయ కైంకర్య ధుర్యుల గావించి, కొందరకు త్వత్కథా శ్రవణ, త్వదీయ సంకీర్తన, త్వదాలయాభి గమన, త్వద్బింబ నిరీక్షణ, త్వత్పూజా విధానాది క్రియల, నాసక్తులన్ తదితర విరక్తులన్ గా నొనర్చి పేర్చిన కృప నర్చిరాది మార్గమ్మున పరంజ్యోతి వగు నిన్నున్ జేర్పు పరమ యోగి గమ్య చరిత్రుండవై - యిటు లతి పవిత్రుండవైన - నిన్ను నతి మూర్ఖులగు మా బోటులు గనన్ జాలుదురే! మహాపరాధి నగు నన్ను జ్ఞాన బోధలన్ గృతార్థుం జేసికొనుమని సాష్టాంగమ్ము గావించి.

అని వినుతించుచుఁ -భృగుమహా ముని మెల్లన లేచి మ్రొక్కి నే
పనివినెదఁ ముద మ్మలర బంపగదే! కరుణా సముద్ర! నా
మనమున నెప్డు గోరుదు "రమాసతి" దోడుత వచ్చి నీవు ద
ర్శన మిడవే! వికుంఠమున సంస్థితి నైట్లటు నాదు ముంగటన్.

అంత శౌరి యాజ్ఞ నమ్మౌని చంద్రుండు
తిరిగి తిరిగి గనుచు - తెరువు బట్టి
తాను శ్రీ సరస్వతీ నది పొంతకు
వచ్చె-మౌను లధిక వాంఛ గనగ.



# భృగుమహర్షి తిరిగి సరస్వతీ తీరమునకు వచ్చుట

మును లార వినుడు నే ముద మొప్ప మీ యాజ్ఞ
                    సత్య లోకము నకు జనితి-నందు
వాణీశు రాజస వైభవ మీక్షించి
                    క్రన్నన రజిత భూ భృన్ని వాసు
నంతిక మున కేగి- యతడిచ్చు నర్ఘ్యాదు
                    లందుకొనక యున్న -నలిగి శూల
మున వ్రేయ బూన- నయ్యెన సర్వ మంగళ
                    గావున "శివ" వాని గౌగలించి
యిట్లు సేయుదురా! మౌను లేల వత్తు!
రొకటు వచ్చిన వారెట్టి లున్న నేమి!
పూజ గావించు టది మునపోటి వారి
కుచిత మని చెప్పి శమియించె- "భృగు" డంత,

అమిత తామస మున ననులోమము విలోమ
మెరుగ డనుచు నతని మొరిగి మొరిగి -
మున్ను మున్ను సర్వ మోదావహ మ్మైన
శ్రీ వికుంఠ పురము జేరి నాడ -

శ్రీ వరు-కంజాతాక్షుని -
శ్రీ విలసితు- నతని జేరి - శ్రీ వనమాలా
తేవఁ గొను పెన్నురమున
దా వినయ విహీన మతని "దన్నితి" నుండీ-

ఎంత శాంత ? మెంత శాంతమో ? శ్రీ రమా
కాంతు డపుడు నాదు కాళ్లు గడిగి -
పూజ సేసి -దాను బోటులు కర్పూర
హార తిచ్చి - రేమి ? యనగ వచ్చు !

సర్వ శక్తి సంపన్నుడు - సర్వ కర్త -
సర్వ భర్త - పరంజ్యోతి - సర్వ భూత
జాత - యధ్యాత్మ వేది-విజ్ఞాన ఘనుడు -
గాకయున్న ? నొరుల కిట్లు గలదె ? యోర్పు ! -

గ్రాహగ్రస్త మహోగ్ర తాపమున గర్వం బేది నిర్ధూత స
ర్వాహంకారుడు నై-గజేంద్రు డఖిలాండాధీశు డెవ్వండు ? నా
దేహగ్లాని యతండు మాన్పు నని ప్రార్థించఁ విధీంద్రాదులు
"న్నాహన్నాహ"మంటచు రాక జన రాడా ? విష్ణు డప్పట్టునఁ-

ఆది నారాయణుండతడె - సర్వ నియంత
యతడె- సర్వేశ్వరుం-డతడె-సర్వ
జగ దంత రాత్మ- శ్రీ భగవంతు డతడె-స
హస్రాక్షు డతడె- సహస్ర శీర్ష
డతడె-సహస్ర పాత్తు-డద్వితీయుండు-
నతడె-నిరంజను డతడె-నిర్వి
కల్పు డతడె-నిరాఖ్యాతుండు-సిద్ధుం డ-
తండె- పరేశు డతండె దివ్యు-
డతడె-జాత పరంజ్యోతి యతడె-బ్రహ్మ
దినక, రాగ్ని, శశి, ప్రభ, దెలియ నతడె-
యతడె హా ! దేవ దేవ్యుండు- నతడె-సర్వ
శేష-సర్వాత్మలకు-ముని శ్రేష్ఠు లార ! -

పంచ సంస్కారులై యర్థ పంచకమ్ము
పంచ మోపాయ నిష్ఠ సాధించి-మించి
పంచ కాల ప్రపన్ను లై-పంచ పంచ
పంచ తత్వాతిశయము ని సాధించి మనుడు -

మాటిని మాటి నెరిగి యిరు
మాటిని పో మీటి యువల మాటకి తానే
మేటియు నై మాటను తుద
మాట వెలిపి సక్షి లోక మాన్యు దలంతుజా.

అజ్ఞానేక పిఘంబుల ముని జనమ్ముల మన స్సందేహమ్ముల బాపి నారాయణ పరాయణులయి మనుం డని బలికి-యులకు గలుగు మనమ్మున నిట్లని తలపోయుచుండె -నది యెట్టి దనిన -

ఊరక నే నింట నుండ-కేటికి బోయి
తి నయొా ? సరస్వతీ తీరము నకు ?
జనుదుగా కేమి ? యచ్చట మౌని సంఘముల్
మించు గోష్ఠుల వసియించ నేల ?
నుండునుగాక ? వా రంద రెందుకు బంప
వలె ? త్రిమూర్తుల పరీక్షలకు గాసు ?
బంపిరి పో ? నాకు భర మన కేటికి ?
బూనితి నిక్కార్య మూన జూడ -?

యఁజహారుల తోటి పొసఁగైన హారిని గనక -
దుడుకుఁ బైఁ భక్తి కోపమ్ము తొంపరింప -
వైజయంతీ సురంజిత వక్ష మేల ?
గదిసి "తన్విత్రి"? శౌరికి కరుణ దప్ప -

మరియు

పన్నీరు జిలుకులు పరిమార్జ నమ్ముగా-
మేలి కర్పూరపు పొడి మెత్తు గాగ -
మలయజం బంతట నలదుట యెలుకంట -
ముత్తియమ్ముల సరుల్ ముగ్గు గాఁగ-
గౌస్తుభాధిక మణి గణము దీపాళి గా -
తులసి దామము పచ్చ తోరణ ముగ -
పగడలు నీల సోపాన పంక్తులుగాగ -
కల్ప ప్రసూనాళి కప్పు గాగ -
దనరి శ్రీహరి వక్షమ్ము తనదు "పెండి
లిల్లు" గా నెంచి -యిదియె నా కిష్ట మని - ని
వాస మొనరించె లచ్చి-నా దోసము నను
రిచ్చ వడి లోన నేమని నొచ్చు కొనెనొ ?
7)

పక్షీంద్రు డెంత లోపల గుందెనో ? శేష
ఫణికి నెమ్మన మెంత బాధ పడెనొ ?
సేనాధి పతి కెంత చిత్తమ్ము నొగిలెనో ?
భూ దేవి డెంద మే పాక గనెనొ ?
నీళావతీ మన మ్మే లీల నుండెనో ?
ముక్తు లెం తెంత విరక్తి గొనిరొ ?
సనకాదు లిది విని చాలరోషించిరో ?
యితరు లేమని మదినెంచి రొక్కొ ?
పరమ భాగవతులు మహా దురిత మనుచు
యెంత యోచించి రో ? యిట్టి వింత మదిని
నాటు కుండునె ?యిక వేయి మాట లేల ?
కలత నే జేయు నట్టి దుష్కార్య మునను -

పరుడు -పరముడు -పరగతి - పరమ పదము-
పరకరుండును-పరమాత్మ - పరమ యోగి -
పరుల రక్షించు పర శక్తి -పరమ భక్తి -
పరుల కగు వాని -కపచార పరులు -నరులె ? -

ఏ పాప మెమ్మొనరించిన
శ్రీ పతి రక్షించు -నట్టి శ్రీ పతి యెడలన్
దా పాప మెమ్మొనరించిన
పాపాత్ముని పాపమునకు పారము గలదే ?.

అని తలపోసి పోసి భవ దంఘ్రుల నమ్మితి నో మహాత్మ ! యో
వనజ దళాక్ష !- యంచు ముని వర్యుడు ఘోర సమాధి నిష్ఠ నె
మ్మనమున బాదు గొల్పి-సుసమాహిత చిత్తము తో ననేక హా
యనములు భక్తి చే పరవ శాత్మకుడై తప మాచరింపగన్.

ఆ వేళ "స్వశరీర వాణి" యనె -నయ్యా-మౌని రాజేంద్ర! నీ
భాప మ్మందు మహాపచారి నని తాప మ్మూనగానేల ? శ్రీ
దేవీ నాథుని గూర్చి యాగ మొనరింతే నాతడు న్మెచ్చు-"య
జ్ఞోవైవిష్ణు"వటంచుబల్కవె ? శ్రుతుల్ సూక్తుల్? బుధుల్ మెచ్చగన్

పూర్వ కంధి ప్రాంత ముని కూట పురికి "గ
వ్యూతి" మాత్ర భూమి నున్న "కణ్వ
మౌని పుణ్యాశ్రమము"న "మఖ" మాచరింపుము
భద్ర మౌను- తుంగ భద్ర ప్రాంత -

పలికిన భృగు ముని నెమ్మన
పులికి పడన్ లేచి దిశలు సూర్వ్యము గనుచున్
నలుకుచు నిగతి నెవ్వరు
బలికి ? రనుచు నెమ్మన మున భయము దొలంగన్.

మున మిచ్చె-నభయ మిచ్చెను -
సదయుడు శ్రీహరి యటంచు సమ్మోదము తో
మది పొంగ-కణ్వు నాశ్రమ
పదమున కున్ జేరె -యజన పరికరముల తో-

ఇటు నారద మౌని నిరా
విటునకు విధి జెప్పు కథను విని-వేడుక మీ
పటి వృత్తాంతము విన ము
చ్చట సూతున్ గని-మహర్షి జన మడుగుటయున్.

శ్రీ మహితోభయ కావే
రీ మధ్య నివాస-భోగి కృతతల్పశయా !
శ్యామల దూర్వామల స
త్కోమల రుచి సాంద్ర-రంగ కువలయ చంద్రా !

దినేశాయుతానూన దీవ్య ద్విమానా
ధనేశ్మిత్ర మోద ప్రదా నాభధానా
వినాశీకృతామర్త్య విద్వేషసేనా
జనానంద కృద్రంగ సంస్థాన భానా.



# (ద్వితీయాశ్వాసము)

శ్రీ వసుధా నీళా నుత
తి వల్లభ! విభవ విజిత దేవాధిప! స
ప్తావరణా వలియుత - శ్రీ
కావేరీ తీరవాస! కస్తురి రంగా! -

అవధరింపుము శౌనకా ద్యఖిల మునులు
సూతునకు నిట్లు బలికిరి చోద్యముగను -
నాలమోరెంపు తపసి యత్యాదరమున
యువలి వృత్తాంత మేమని యడిగె ననుచు.

సూతుండిట్లనె - మౌనులార!-వినుడీ సొంపొంపగా నారదుం
డో తండ్రీ! చతురాననా! దెలుపు నీ యుక్తుల్ సుధా పూరముల్
చేతః ప్రీతి కరమ్ము లన్న-విని-నీ చిత్తంబు పుత్రా! విని
ర్ధూతాఘమ్మని బల్కె సజ్జనుడు నెంతో సంతస మ్మొందగన్.

హరి కథ జెప్ప దొడంగెన్
పరమర్షి భృగుండు తాను భక్తి-యుజనమే
వెరవున సల్పెద నని? దిశ
లరయుచు కణ్వాశ్రమమున కరుదెంచె వెసన్.

# వసంతకాలవర్ణన

అంత వసంత ముద్గత హిమాంతము నై పొడసూపె యోగని
మంత వతీ కుచ ప్రచయ మంజుల కుంకుమ రాగ వాసనా
క్రాంత దిగంత మబ్జ శర రాజ భటాక్రమితాతి గాఢ వి
శ్రాంతము పాంథ లోక సుమహద్భయ కారి లతాంత కుంతమై.

కోయిల లును కాకములు ను
బాయక కలహించ నంత బలి భుక్కుల నో
ర్మూయింప కాల తీర్పరి
వ్రాయించిన లేఖలన నొరలె పల్లవముల్.

“వర్ణ” మొక్కటి గాన మా వారు బెంప
బెరిగి “భాషాంతరమ్మ”న భేద వాది
ద్వైతు లైతిరి-మా పంక్తి దలగు డనుచు
కాకములు “నిరసించెను” కోకిలముల-

పరువ ముడిగి ధర బొరగెడి
విరి తండము లొప్పె మధుప విసరము మధువన్
సురద్రావి పార వైచిన
బొరలెడు నుచ్ఛిష్ఠ పాత్ర పుటికల భంగిన్.

వీచెఁ జల్లని గాలి ఘూమిపంబు-తావిఁ గుల్కుచుఁ మెల్లనై
కాచెఁ బాల రసాల సాలములు పొంకమ్మై ఫలించంగ తా
నేచెఁ మారుడు క్రూరుడై విరహులఁ హేలా సముల్లాసియై
పూచెఁ మోదుగ లెల్లడఁ బరువమై పూర్వ ప్రభల్ నిండగఁ.

కమ్మని వింటి రాజు పయికం బొన గూర్పగ తర్వుగాండ్లగా
ఉమ్మడి జంట్లు నంప-వెరతో రసపాన మొనర్చుచుఁ మరి
కొమ్మల నెక్కుచుండ విని కోపుల గాంచగ గూఢచారులై
పొమ్మని వచ్చెనో! యనగ బొల్చెను మెల్లన గమ్మ తెమ్మెరల్.

పాల ముల్కులను పతుల్ పలుకరించిన మారు
బలుకని సతుల కోపమ్ము లుడిగె -
లేతకెంపు మోవుల ప్రోషిత భర్తృకల కొక్క
ఘడియ యుగంబుగా గానుపించె -
ఒక్క లిప్తైన లొప్పమి జేయు రోషించు
కాంతల నెమ్మది కరుగ జొచ్చె -
మానము మెక్కిన గాని మొగ మట్టుద్రిప్పని
కులసతులకు రతికోర్కె లోదవె -

చిలుకలను గోరువంకలు కలికి కోయి
లలును తుమ్మెద కదుపులు బలిసి చుట్టు
గ్రాల మారుడు విరివిల్లు కేల బూని
దండు వెడలె నొకో ? యను తల్లడమున.

మరియు మదనుండు దండు వెడలు తరి నడుగులకు మడువు లిడు వడువునన్ బొడవగు తోపు చీరలనన్ జిగి మిగులు నిగురు జొంపంబులు లెక్కకు మిక్కిలి యగునటుల మొక్కచు నెక్కడేనియు న్కొక్క ఖండిత కిసలయంబు గనుపడిన యది యన్యోచ్ఛిష్టంబని విడిచి గడచని తమ ద్విజత్వంబు సార్థంబుగా దలంచు వివర్జిత కాకంబులగు పికంబులను, -మధుకాల మాధవునకు వనదేవత ఫలోపహారంబు లొసగెనో? యను నటుల పండిన రసాల సాలమ్ముల ఫలమ్ములు కొంచక తమ చంచూ పుటంబుల జించిన స్రవించు రసం బమృతోపమానంబుగా ద్రావుచు - నిరస్తేతర ఫలాపేక్షలై నైజ శుకత్వంబు నిలుపు కొంటిమని విహరించు మృదు వచన రచనా విమోహితావని భృత్కామినీ జన వారంబులగు రాజ కీరంబులును - పొంకం బగు పర్వ శశాంకుని సకలంకుండని నకలంకం బగు మొగంబుల జంకించు సంకుమద గంధుల జంకెన వాడి చూపులకున్ జిక్కి కింకరు లగు నాయకుల సంకేత స్థలంబులకు బుచ్చి యచ్చిక బుచ్చి మాటల ప్రొద్దు పుచ్చు చూత మవి బొంకులని శంకించు దురో? యన పంపు కింకరీ జనంబుల వలె నంకిలి మాలి సుంకుదీరి నెలవంకలకు వంక లిడు గోరవంకలును- సకల లోక రక్షణ పరాయణులగు నారాయణ పాదరాయణుల సాకారు లగు మమ్ము నూగారుల దృగ్ధారల నెరుల తీరుల జయించితి మని

వారలవీరలవలె మధుపాన వికారుల మనారులమని కారులాడు నారు
జోరుల మరున్నారులమ్తై జయించెద మని యహంకారంబున హుంకరిం
చునోః యన్న యటుల ఝుంకరణ విస్మృమరంబులగు భ్రమరంబులును.
పరాంగనా సంగ మాసక్తుండగు దుష్ట చిత్తు నాయుర్విత్తంబుల సాటి
నానాటి- కిపురంబారిన సరోవరంబుల నానంద భరితు డెందము
గతి గ్రంపక గ్రందు కొని యున్న నరవిదంబుల మాటున పలపల
సీట గూటువలు గూడి దాటు లెసగు నిజ ధాళ ధళ్య వినిర్జితాబ్జ ముఖీ
లోకాలోకంబులగు మత్స్యానీకంబులును, అగ్గువగు విరహతాపంబు
బెగ్గలి దిగ్గున లేచి తమదగ్గర జేరు నగ్గజగామినులు సిగ్గువడ మొగ్గరంపు
మాటలాడు విటుల మకురు తనంబులకు తగ్గి దోసిలొగ్గి వేడికొన బిగ్గ
గౌగలించి, బుగ్గల ముద్దిడ నవ్వు నవ్వనితల మువ్వంపు పల్వరుస
వలె నిగ్గుగల **విరిమొగ్గలను**,- పగలు సంజగడ వగకాండ్రును దారుస
సయ్యాటకున్ జొచ్చి మెచ్చి కనుసైగలు నిక్కువలకున్ బుచ్చి యి
వచ్చెద మని రేపటి యుయ్యాలల విరిశయ్యల న్బండి తియ్య విలుకాని
సుమ బాణంబులకున్ బయ్యరకున్ నయ్యెడల నిలువన్ జాలక వయ్యా
రంపు నడలన్ కదలి కుయ్యుడు దూరంబునం గల పానీయ శాలలకున్
జని తమరాకకు నిక్కి నిక్కి- చూచు నెయ్యంపు విటుల నిరపేక్ష
శయ్యలన్ మరు కయ్యంబుల తృప్తులన్ జేసి పయ్యెదలన్ గప్పుకొని
తమ వారి కియ్యెరువెరుంగ కుండ నొయ్యన గృహ కార్యంబులన్
జెయ్యుదు మన్ తిరుగు తొయ్యలులును- భర్త్రాగమన కుతూహలంబు
కల ఘనంబు లగు మనంబుల మునుపటి వసనంబు లూడ్చి నవీనం
బులగు పటంబులు దిటంబుగ ధరించు నించు బోడుల వలె కారుటాకు
లూడిగంద్రోచి **కిసలయా** కలితంబులగు కోరకంబులం దాల్చి నవకం

బునం బొల్చు నభిరామంబగు నారామభూములుం గలిగి సుమనోభిరామం బై స్వర్గపురంబునుం బోలె సర్వమంగళావాసంబై కైలాసంబునుం బోలె- భూమిజాతాభిరామంబై యయోధ్యా నిలయంబునుం బోలె, మధు భరితంబై మాధవు చరితంబుం బోలె, కృష్ణ, వర్ణ, సుందరంబై -బృందా వనంబు నుం బోలె నత్యంత కాంతం బగు నవ్వసంతాగమవంబున -

అలికుల వేణి ! కోమల లతాంగి ప్రసూన సుగంధి-కీరవా
ణీ-లలిత బాలపల్లవ కరాంఘ్రి సరోరుహ యుగ్మ-కుందకు
ట్మల వసనాసు రంజిత-సమగ్ర మరంద ముదశ్రు పూరయై
యులరె ! కనుంగొనఁ వనరమాంగన మాధవు డేగుదెంచినఁ.

అంత సకలాగమాంతము లంతయు గను
సంతతామోదమున మునిచంద్రు డపుడు
స్వాంతమున సప్త తంతువు సలుప శౌరి
సంతసించు వసంతావసరము గనుచు.

తడయుంగ రాదు హరి కృప
బడయుంగా నవసరంబు బాటిలె ననుచుఁ
దొడితొడి మఖ పరికరముల
గడియించెద ననుచు శిష్య గణముల తోడఁ.

వెస కుశలు సమిత్పలములు
కుసుమా ద్యోలూఖలములు గో క్షీర వధుల్
ముస లాఘ కరీషంబు ద
మస యూప స్తంభ పాత్ర మార్జించి తగన్.

అరణి అగ్నిహోత్ర హవణులు ధమనియు
దర్భ సూత్రములను తగిన యిష్టి
కలిమి యఖిల వస్తు గణములు సాధించి
యజ్ఞ వాట మున నియతి వహించి.

జ్ఞాన విరక్తి భక్తి సహకార శ్రుతి స్మృతి వేదు లైన-వై
ఖానస వాలఖిల్య శుక గాలవ కణ్వ సుయజ్ఞ ధౌమ్య వై
శ్వానర శంక మంకణు, సువత్స వశిష్ఠ ఘటోద్భ వాది స
న్మానుల యాజ కార్యము క్రమంబుగ బిల్వగ బంపె శిష్యులన్.

వార లేగి మౌని వర యాశ్రమంబుల
వ్రతుల గాంచి పుణ్యవర్తు లైన
మిమ్ము భృగుమహర్షి రమ్మనె యజ్ఞార్థ
మేగు డెం డనుచు వచించుటయును.



విని వారలు కాల విలం
బన సేయక శిష్య పుత్ర వర్గము తోడన్
జనుదెంచి రౌర ! నేటికి
గన నయ్యెను భృగుమహర్షి ఘన నవమనుచున్.

అంత

నిగ్రహానుగ్రహ సమర్థు లుగ్రనిష్ఠు
లగ్రజన్ములు విద్యా సమగ్రు లింద
వగ్రహము ద్రోయజాలు మీ వంటి వారు
విగ్రహము లేక వచ్చుట వింత గాదె ?

కావున నే నొనర్చెడి మఖంబున కంపరు మీరు దోడుగా
గావలె యజ్ఞ విఘ్నకరగర్వుల దైత్యుల బాధ నొంద నీ
కేవిధి నైన దీని నెరవేర్చగ వేడెద-మున్ను నా మహా
దేవుడె ! యజ్ఞ విఘ్న మన దింపడు కోపము నన్ను లేమనన్.

అన విని నమ్మను లెల్లన్
ఘన కౌతూహలము లెసగగా నిట్లని - రో
ముని చంద్ర ! నీ మహాధ్వర
మున కే మెవ్వరము ! సర్వమును నెరవేర్పన్.

హరి గలండు సందియం బూన కిప్పుడు
దీక్ష బూను మీ యుపేక్షలేల ? -
యనిన భృగు మహర్షి యానంద వారిధి
మునిగె నెమ్మనమున మోద మెసగ -

మృగ చర్మాంబరుడై-సుదండ కరుడై - శ్రీ మించు కౌశేయ సూ
త్ర గరిష్టాంచిత మేఖలుండు నయి -హృద్యస్ఫూర్తి యై-వేదమం
త్ర గణార్థానుభవైక చిత్తుడయి - ధైర్య స్వాంతుడై - మౌని తా
తగ నొప్పెన్ మృగశృంగి యై-ముని గణోద్యద్యజ్ఞ వాటంబునన్.

ఇల "భరద్వాజ" మునీంద్రు డధ్వర్యు డై
యాజుషామ్నాయంబు నధికరింప -
హోతయై తను "కణ్వ యోగీంద్రు" డాగ్నిక
సంప్రయోగ క్రియ సంఘటింప -
"కశ్యపముని" సామగానంబు నౌద్గాత్ర
పదమూని శాస్త్రముత్ బలుకు చుండ-
"అత్రి ముని" శ్రేష్ఠు డాగ్నీంద్రుడై సత్రి
యా కలాప మునకు నాజ్ఞ లొసగ -

నఖిల వేది "వసిష్ఠుండు" నడుపు యజ్ఞ
ధర్మ వేత్తలలో సుప్రసిద్ధ యగుచు
సర్వమును గాంచ తక్కిన సకల మౌని
వరులు యాగము నిర్విఘ్న సరణి జరుప.

రక్షోనాశన మంత్రము
లేకస్వరమున చదువుకొనుచు నిటు నటు గనుచుఁ
బక్షీంద్ర వాహనుడు మము
రక్షించుఁ గాక యనుచు రాజిలు చుండఁ.

సార మంత్రముల నుచ్చారణ క్రియ లొప్ప
పఠియించు విప్రోత్తమ పంక్తి గదల -
నుచి తోపయోగ ప్రయోగమ్ము లొనరించు
ఋత్విగ్గణములకు మే ల్జమట లొసవ -
ఆగమార్థానుభవైక తత్పరు లైన
పెద్దల కతి నుతి ప్రేమ వనర
యజ్ఞ సభాసదు లై యున్న తజ్ఞుల
తత్తత్క్రియానువాదములు జెలగ -

యఁజన కౌతూహలము జూడ నరుగు దెంచు
యఖిల జనులకు సంతస మ్మతిశయింప
దినదినానంద వర్ధక తను వహించి
జరుగు చుండెను మునివర్యు సవన మపుడు-

శ్రీ రమ్యాంబై - స్వాహా
కారంబుల నాద్య హోమ కలితమ్మగు గో
క్షీరాన్నాహుతి పరిమళ
వారంబుల దిశలు సంప్ర వర్ధిత మయ్యెఁ

హోమ ధూమమ్ము లాకాశ సీమ బర్వ -
గాంచి నీరద మను భ్రాంతి గదిసి కేకు
లెల్ల నాట్యాంగనల వలె నల్ల నల్ల
నాటలాడగ జొచ్చిన వతి ముదమున-

కమ్మని హోమ గంధములు ఘ్రాణ సుఖమ్మిడగా -లలాటముల్
సెమ్మట లీన- మంత్రముల జెల్వుగ మాటికి నుచ్చరింపు సం
దమ్ముల కార్య లోకము లెద న్ముదమందగ నర్త్విజుల్ ప్రమో
దమ్ముల తోడ వ్రేల్వగ దొడంగిరి వేల్పులు సంతసించగఁ.



అమరానీకము లెల్ల శ్రౌతి గణ మంత్రాహూతులై-సద్విమా
నములన్ గొమ్మలతో భటావళులు వెంటన్ గొల్వగా - హవ్య మా
జ్యము బ్రాశించుచు మింట నిల్చి రవురౌరా ? శ్రీ రమానాథు డా
గమ సంవేద్యు డిటేల రాడనుచు !-సత్కారుణ్య మొప్పారగన్.

సత్రమ్మిట్లు లభూత ప
విత్రమ్మై - యఘలతాలవిత్రమ్మై - స
న్మిత్రమ్మై - బ్రాహ్మణశా
మిత్రమ్మై వెలసె -నబ్జమిత్రులు మెచ్చన్.

ఆ ముని చంద్రుండు వపా
హోమావసరంబునన్ మహోజ్జ్వల కీలా
స్తోమాగ్ని శిఖా మధ్యో
ద్ధామున్ శ్రీ ధాము పరమ ధామున్ దలచెన్.

ఏ దయా శాలి ప్రహ్లాదుని రక్షింప
నావిర్భవించె ? స్తంభాంతరమున -
ఏ కరుణామూర్తి యిభరాజ రక్షణ
కవతరించెను ? పరమాదరమున -

ఏ మృదుహృదయుండు ! శ్రమించు ద్రౌపది
దలుపంగ తరుగని వలువ లిచ్చె !
ఏ ప్రపన్నార్తిహు డింపుగా శత్రుని
యనుజుని తనతమ్ము నట్లు మనిచె !
యట్టి జగదేక రక్షకుం-డఖిల సేవ్యు
డాశ్రితామర భూజమై-యలరు నట్టి
శ్రీజనార్దన దేవు డవ్యాజ కరుణ
నీమఖాగ్నిని దా ప్రభవించు గాక -

నరసుతు సతి గర్భావన
మరయంగా సత్యమేని.? హరి చక్ర గదా
ధర శార్ఙ్గ నంద కాయుధ
ధరుడై యజనాగ్ని యందు దయ నుదయించుత్ -

గాలిమేపరి దొర శయ్య లీల నచ్చి
నేల చేడియతో గూడి క్రీడ సలుపు
పాలమున్నీటి యల్లుడ - పతితు నన్ను
నేల వేంచేయు మిక - తప్పులేల వెదుక !

పేర్చిన కృప జనకుని క్రియ
నోర్చితిని మహాపచార మొనరించిన న
న్గూర్చి యిక నీ "స్వయంవ్య
క్తార్చాకృతి" జూపవే జనార్దన! శౌరీ!

స్థాణు బిడౌజు హవ్యభుజు సౌర మహాసుర పాశ భృజ్జగత్
ప్రాణ ధనేశ ముఖ్యులు నిరంతర మెవ్వని యాజ్ఞ నైజకం
ఖాణము లెక్కి యెయ్యెడల గాంతురు తద్దిశ లట్టి సర్వగీ
ర్వాణ నుతాంఘ్రి పంకజుడు రావలె నీవలె కేవలేష్టముల్.

వేదహరు ద్రుంచి . గిరి మీద ధరియించి -
తన సూది మొన దంష్ట్రికను మేదినిని క్షేమా
పాది యయు యుంచి -పరవాది నెదిరించి -
బలిమీద పదముంచి - ప్రథమాది పర రాడ్గ
ర్వాదుల హరించి - సిరి పైదలికినై ఖ
ల ఫలాది తల ద్రెంచి-హలమూది-రవి జాతా
భేదన మొనర్చి -జినివాద మొనరించి -
కలి నాదట జయించి - పరమాదయిత రావే.

అంబుజ భవాండములు దుంబరఫలంబు -
ల క్రియఁ బొడమ జెంప విలయంబు నొనరింపఁ
డంబ మరి శంభు విధి శంబధర సాధు
హృదయాంబు జాతంబుల కరం బమరి సర్వా
ఘంబుల నడంప నతి సంబరము లొందె
డు మనంబులను మౌని వరులుం బరముగా నె
న్నం బురుషమూర్తి వగు నంబురుహ నేత్ర
కనకాంబరుడ నీ మృదు పదంబులు దలంతుఁ.

ఇటు భృగు జటి వేకటి యా
కటి పెల్లిన సృక్కు నటుల కటకట పడి యి
ప్పటి కిచట పసిడి దుప్పటి
కటి జుట్టిన వాని కరణి గాంచెద నముచుఁ.

మునుపటి యట్ల శౌరి గని ముచ్చట లాడెద నన్న నేగ దా
జన దిక - యజ్ఞభంగ మిది సైచునొ ? సైచక కోపమూని తా
చనువున బల్కునో ? ప్రభువు సన్నిధి నెట్లగునో ? గదా ! యటం
చని మది నూహ సేయుచు-మహాతురుడై-హరి దర్శనార్థియై-

హరిని మది నెంచి త ద్దర్శనాభిలాష
కరము ముమ్మరమయి గుండె భరముగాగ
కనులు జెమరింప - కంఠమ్ము గద్గదింప
దీన వదనమ్ము తో భృగుమౌని యంత.

ఎంతకును ఆరమాకాంతుడు దయాంతరంగుండయి దర్శనం బీయమికి చింతించి తన యజ్ఞంబు నం దేమైన దోసంగు గలదో ? యనుకొనుచు లేక తనస్వయంకృతాపరాధమ్మునకే యిట్టి పాటు గలిగె ననుకొనుచూ తాను శ్రీమన్నారాయణునకు చేసిన మహాపచారమ్మునకు మరింతగా బాధనందుచూ 'యేది యెట్లైననూ' శ్రీజనార్దనుని సందర్శించితీరవలయు నన్న బెట్టిదపు కోరిక పట్టుదల మనసున గట్టిగా నాటుకొన -నప్పట్టున కృతనిశ్చయుండై -స్వామీ! జనార్దనా! నాకీక్షణంబ యీ మఖాగ్ని యం దావిర్భవించి దర్శనం బీయవేని ! నా జన్మం బనర్థంబు-నాయాగంబు నిరర్థకంబు-కరుణాంతరంగుడవన్న నీయశంబు వట్టిద ఃబంబు- నీభక్త వాత్సల్యంబు సర్వాబద్ధం బని నిరూపించుటకై నే నీ యజ్ఞాగ్ని గుండం బు నందు నిన్ను సంపూర్ణంబుగా నమ్మి సర్వాగపూర్ధ సంపూజ్యుండ వని నీపై తమతమ విశ్వాసంబుల వెలపోసిన నీ యీ భక్తగణ సమ క్షంబున నే ప్రాణంబుల విసర్జింతు నని కఠోర ప్రతిజ్ఞా మనస్కుండై యజ్ఞాగ్ని గుండంబునకు ప్రదక్షిణ నమస్కారంబు లాచరించి - "శ్రీ జనార్దనం శరణం మమ" యనుచూ - నురుక నమకట్టిన తత్

క్షణంబు - వత్సా : శాంతింపుము - శాంతింపుము - నీ భక్తి ప్రపత్తులు వినయ వివేకములు శ్లాఘనీయమను మృదు మధుర గంభీరవచనమ్ములు హోమాగ్ని గుండమ్ము నుండి వెల్వడయె - ఆ గంభీర వచన మాధుర్యమునకు రిచ్చపడి మౌని వరేణ్యు లందరూ పులకాంకిత చేతస్కులై నిమీలిత నేత్రులై తమ పూర్వ సుకృత ఫలమ్ముల కాశ్చర్యము నందుచూ వీక్షించుచుండ,

శ్రీ రమా ముగ్ధ వైభవ శ్రీల దనిసి
సరస సల్లాప కేళిలో మురియుచున్న
రంగనాథుడు కరుణాంతరంగు డైన
భక్తవత్సలు డౌట తా బయలు వెడలె.

వరుస వరుసన భృగుమౌని పరమ యత్న
మాప చనుదెంచె - నపసవ్య భాసమాన
శంఖ చక్రాంక హస్త విశ్రాంతు డౌచు
శ్రీరమా భూమి తరుణులు జెన్నొసర్ప.

ఇట్లక్షీణ క్రతుదీక్షా దురంధరుడగు భృగు ప్రేక్షా పదాధ్యక్ష మఖాగ్నులు ప్రదక్షిణార్చులః ప్రవర్తిల్ల దక్షిణభుజాక్షులు శుభ లక్షణంబులు సూచింప నాక్షణంబు - గరుడ వాహనారూఢుండై.

పులుగు రాయుని చట్టుపల గాడ్పుల కొల
దూదిపింజల న్గెల్ల దూల దోల-
మణి గణ ఘటిత సన్మకుట కాంతి చ్ఛటల్
కడిగి యజ్ఞానాంధకార మపప-
శంఖ చక్ర గదాసి శార్ఙ్గాయుధమ్ములు
హరి ధ్రువంబని తెలియంగ జెప్ప-
ఇరుపార్శ్వముల నుండు సిరి ధర లీతండె
నిఖిలార్ధదుం డని నెలవు జూప -
దివ్య పీతాంబరుండు - ప్రదీప్యమాన
హార శోభితుడును - దరహాస వదను -
డంబుజ దళాక్షు డైన జనార్దనుండు
డంబునర వచ్చె హెూమ గుండంబు వెడలి.

సాంబు కృష్ణ జలద మంబరాంచిర చుక్సు
రమ్య మగుచు శంఖరావ గర్జ
గదిసి మౌని చాతకంబుల చిరతృష్ణ
విరియ సత్కటాక్ష వృష్టి నించె -

శ్రీదమ్ములై హృత భేదమ్ములై సంప్ర
మోదమ్ములైన శ్రీ పాదములును
శస్తంబులై భయోధ్వస్తంబులై రమాం
ఘ్రిస్తంబులైన శ్రీ హస్తములును
ధాత్రీ భయదములు - శత్రు భయద శత
పత్ర నయదములునౌ నేత్రములును
కాము జయించు సుత్రాము నుతు నొంచు
హిమధాము మెయి నలయించు మించు
లుప్పతిల గొప్ప కన్గవల్ డప్పుగొప్పు
లెప్పుడును కళగల మోము లొప్పు లొలుక
కప్పురపు తావి గల - సిరి యప్పుడమియు
తప్ప కిరు జక్కిగల, దయ గుప్పు, హరిని.

కనిరా మౌనీంద్రు లంతన్ విగతధన రాశిన్ గను ప్రాంచిహేలన్
కన దుద్యద్వైజయంతీ ఘనమణి లసత్కాంతి మత్పీనవక్షున్-
వనజాక్షున్-సర్వలోకా వన నిజ మహద్వైభవోల్లాస దక్షున్
ననసూయాయా సుప్రమోదా ద్యఖిల గుణ సత్ప్రాభవ శ్రీసమక్షున్.

అమృత ఫలదమగుచు నమరాశ్రయ మ్మైన
హరి "సురాగము" నకు నతి విరాగు
లయ్యు సానురాగు లై రే మనగ వచ్చు
మునులు నిష్ట మిచ్చి మనుచు ననుచు.

సరవిఁ - దిగ్గన లేచి - మోదము మదిఁ సంధిల్ల సద్భక్తిమై-
కరము లొమ్మోడ్చుచు నేటి కిందు హరినిఁ కన్గొంటి మం చార్తితో
సుర విద్యాధర యక్ష కిన్నర సదస్యుల్ "తేనమో విష్ణవే"
"హరయే" "త్రాహి" యటంచు మ్రొక్కిరి-మహాహర్షాశ్రు పూర్ణేక్షులై

శ్రీధరుం డాది దేవుండు మాధవుండు
శ్రీజనార్దనుండు దయార్ద్ర చిత్తు డగుచు
సవన గుండమ్ము నందు సాక్షాత్కరింప
మునులు "నారాయణా" యని మ్రొక్కలిడిరి.

సాగిలి మ్రొక్కుచుఁ మరల చయ్యన లేచుచు నిత్య భక్తి సం
యోగ మనస్కులై బులక లొప్పెడి దేహము లుఁ జెలంగ గా
భాగవతాగ్రగణ్యులన భాసిలు కొందరు సజ్జనుల్ మహా
భోగిశయాను మూర్తి గని పొంగుచు సన్నుతి సేసి రింపుగఁ.

అంత భృగ్వర్షి చంద్రుండు స్వాంత మందు
సంతసం బొప్ప మీర శ్రీకాంతు గరుడ
వాహనుని గాంచి సంతోష వైభవమున
చింత లెడ బాసి హర్ష విశ్రాంతి నొంది.

సురలుఙ్-యక్షులు-కిన్న- రోరగవరుల్-సోమార్క-విద్యాధరుల్
గరుడుల్-దిక్పతులున్-ముని ప్రవరులున్-గంధర్వులున్-సిద్ధులున్
సరసీజ ప్రభవాదు - లెవ్వని మదిఙ్ - సద్భక్తి చే గొల్తు ? రా
హరి విచ్చేసె మదంతికంబునకు నాహా! యెంత పుణ్యం బొకో ?

ఏయే తీర్థము లందు గ్రుంకిడితినో ? యే యే గిరుల్ గంటినో ?
యే యే వేల్పుల నమ్మి కొల్చితినొ ? యే యే గాథలఙ్ వింటినో ?
యే యే పుణ్య వనాళి ద్రిమ్మరితి నో ? యెవ్వారి సేవింతునో ?
ఆ యా పుణ్యము లెల్ల నాకు ఫలితం బయ్యెఙ్-హరిఙ్ గాంచగన్-

కానరాడు యజ్ఞకర్మంబు లందును
ఘన తపంబు లందు గానరాడు -
కానవచ్చె నిపుడు కలుముల చెలితోడ
చెడని పుణ్యమేమి జేసినానొ ?

అనుచు "సృక్స్రువాదు" లాజ్య పాత్రలు సోమ
పాత్ర లెల్ల దేహ పరవశమున
నవల ద్రోచి వైచి హర్షాశ్రు రోమాంచ
పులకి తాంగు డగుచు బొగడ దొడగె-

కన్న తండ్రిని నిన్ను గంటిని గంటి నేడు కృతార్థతన్
జన్మమున్ ఫలియించె నా దగు జన్మ సార్థక మయ్యె నా
పున్నియం బనుకొందు శ్రీవర ! పూర్ణ చంద్ర నిభాస్యుడౌ
పన్నగారి భుజాంతరమ్మున భాసిలన్ నిను గాంచితిన్.

మున్ను నే నొసరించి తీశ్వర ! మూర్ఖ బుద్ధిని నీయెడన్
సన్నుతాంగి, రమాలలామ, ప్రసన్నమై వసియించు చో
దన్ని ద్రోహము-నాటి పాప మెదన్ దలంచక లచ్చితో
నన్ను మన్నన జేయ వచ్చితె ? నాథ ! దేవ ! దయానిధే !

యజ్ఞ మూర్తి వీవు - యజ్ఞ సాధన మీవు
యజ్ఞకర్త వీవు యజ్ఞ ఫలద !
యజ్ఞ కర్మ మీవె యజ్ఞం బవని మూఢు
లజ్ఞు లెరుగ లేరు తజ్ఞు లట్లు

# (దండకము)

శ్రీమాధవా! భక్తదోషాఘనాశా! దయాశాంతి దాంతి క్షమా సంప్రకాశా!
దిశాధీశ ! లోకేశ ! దేవా ! పరేశా ! సురేశాభివంద్యా ! మహేశాభినం
ద్యా ! రమా క్షోణి పద్మేక్షణా భవ్య వక్షోజ నిక్షిప్త కస్తూరికా గంధ
గోరోచన శ్రీ సమున్నిద్ర ముద్రాంకి తాక్షోభ్యవక్షా ! సరోజాయతాక్షా!
లలాటాక్షముఖ్యామరాధ్యక్ష మాణిక్య కోటీర కోటి స్ఫుర ద్రత్న
విర్యత్న కాంతి చ్ఛటా దీప నీ రాజిత శ్రీ పదాంభోజ ! నమ్రీభవ త్సర్వ
గీర్వాణ శోణాధరీ భర్తృ శ్రేయస్కరీ కాబరీ స్రక్సుధా మోద లోభాగ
తేందేందిర స్త్రైణ భద్రేభ యానా ! సు గానానుకూల స్వన న్నూపు
రోద్య న్మహా దివ్య మాణిక్య బింబాంత రోద్బింబి తానేక దిక్పాలకా!
శ్రీమ దింద్రోపలా జాలకా ! పూర్వ దిగ్భామినీ గర్భ సంభూత కాలోద్య
మద్బాల ఖద్యోత విద్యోత మానా తప ద్యోత మానాబ్జ రాగోల్ల సద్ధార
భా పూరితానేక కంజాత గర్భాండ భాండోదరా ! శ్రీవరా ! శ్రీ
కరాంభోరుహోద్భాస కౌమోదకీ ఖడ్గ శార్ఙ్గాది దివ్యాయుధ వ్రాత
పాతాతి భీతాసురాజ్ఞాత నాశంక రాస్త్రాంబు ధారాతి సంపాత వర్షాకర
శ్యామ జీమూత శంకాకృతా ! ప్రాకృ తాంగోల్లస ద్దివ్య పీతాంబ రోద్య
త్కళా చంచలా సానుజాతాతి గర్జ న్మహా ద్దివ్య చాపాంచిత జ్యా రవా
డంబరా యోధన ప్రాంగణ శ్రీ జయాపాది సత్పక్షి సమ్రాడ్ధ్వజ స్యం
దనా ! భక్త సందోహ శ్రీచందనా ! దేవకీ నందనా ! బుద్ధి ! నీ సుంద
రం బెన్న నే నెంత వాడన్ ?. దయన్ జూడవే - ఘోర సంసార తాప
త్రయ గ్లానికిన్ వీడవై వీడ వేనాటికిన్ నీ పదాంభోజ సద్భక్తి పాలీణు

లై మించు వారి న్మరిన్ మున్ను సౌధాంబుధి ప్రాంత మందున్న పద్మాకరం బందు శ్రీ మద్గజేంద్రాంఘ్రి పద్మంబునున్ బట్టి బాధించు నీరాట ముచ్చాట నం బై జనన్ ప్రేటునన్ జక్ర ధారన్ వడిన్ బంచవా ! వే గటాక్షించవా ? వానిరక్షించవా? పెంచవా? మేను బ్రహ్మాండముల్ నిండగా-వామనా ! నీ మనం బేమనన్ వచ్చు నీ నామముల్ మాకు పాల్ తేమనంబుల్ గదా ? యాగ దానోవగా లేక ద్రౌణ్యస్త్ర విప్లుష్ట నష్టాంగుడౌ బాలుడో కృష్ణ! పే వచ్చి యీ చిచ్చు బో నిచ్చ గావించగా నున్న త న్మాతృ గర్భంబునన్ డొచ్చి పెన్మచ్చికన్ మెచ్చి కష్టంబు బోద్రుచ్చి యాపిల్లనున్ తల్లి నిన్ బ్రోవవే! వేగ దావే గదా దండ మంకించి లోక త్రయం బెల్ల పాలించి శ్రీ విష్ణునిన్ మించి తే నంచు గర్వించు నిర్మోహి యా డింభక ద్రోహినన్ బట్టి ధట్టించి స్వర్లోక మార్గంబు బట్టించి బ్రహ్లాదునిన్ ప్రేమ రెట్టించగా బ్రోచి భావింపగా రాని కౌతూహలం బూనవా ! దీక్షవాత్సల్యతం జూచి దా జేతనున్ గాసునున్ లేని వానిఙ్గుచేలున్ గుచేలున్ శ్రితశ్రీ గుచేలుండవున్ సద్దయం జూపగానున్ గుచేలుండపై నీదు చేరుండ వానిన్ గుబేరున్ వడిఙ్ జేయు ధీరుండవున్నీకు మారొండు జెప్ప న్నుదారుండు నెవ్వాడు? నీతోడునన్నాడు దానిన్ మగ ల్జూచ మందోడు దానిన్ వడిం దోడు నీదెవ్వరున్ లేని వాడు న్బలెన్వీడులో మూడు చే సభ్యు లెల్లన్ దగన్ జూడగా కష్టు పుట్టంబు లూడ్చంగ నీ యాపదాబ్ధిన్ దరిన్ జేర్చు గోవిందః శ్రీ పుండరీకాక్ష ! కృష్ణా! హరీ ! నన్ను రక్షించవే ! యన్న పాంచాలి నక్షీణ వీక్షా కటాక్షంబులన్

జాచి ఘోరాపదన్ బాపి నీ వక్షయానేక వస్త్ర ప్రదానంబు గావించి బాలించి శ్రీ మించవే ! యెంచ వేరున్నదే ! భక్త సంరక్ష దీక్షా పరత్వం బునన్మించు నీ వెప్పుడున్ జెప్పగానేల ! కాకాసురుం డాసురత్వంబుతో మీటి వైదేహికిన్ ద్రోహియై తా దురుత్సాహియై చెంగటన్ గోరి పేరింగలంబో యనన్గారు దేహంబుతో కారుచున్ దగ్గరన్ జేరుచున్ ముంగటన్ దారుచున్ బోరుచున్ మీరు నా వెంగలిన్ గాంచి బొంగారు కోపంబుతో పూరి నంభోజ గర్భాస్త్రము న్బోల మంత్రించి వ్రేయంగ పెన్మంటలన్ గ్రమ్ముచున్ వెంటతా నంటి లోకమ్ములన్ ముమ్మరున్ ద్రిప్పగా గ్రుమ్మరన్ లేక మూర్ఛల్ మదిన్ గప్పమై జెమ్మటల్ గుప్ప స ప్పాహి మాం త్రాహి యంచున్ త్వదీయాంఘ్రి పంకేరుహ ప్రాంత భూమి న్బడన్ భూత ధాత్రీ సుతాబ్జాననాబ్జాన నాలోక నాత్యంత సంతోష సుస్వాంత తఞ్ వానినిఞ్ బట్టి నిఞ్ బోలె జేపట్టి రక్షింపవే। సత్కృపాసాంద్ర! శ్రీరామచంద్రా ! మునీంద్రుల్ హృదంభోజ మధ్యస్థ నీవార శూకంబుసున్ బోలె సూక్ష్మతి విద్యుత్ ప్రభాగ్రస్థితుఞ్ పార మాత్మ స్వరూపుఞ్ నినుఞ్ గాంచుచుఞ్ సంచితాగాములఞ్ ద్రుంచి ప్రారబ్ధ మాత్రావశేషాత్ములై యుందు రందుఞ్ మరిఞ్ గొందరుద్యో గులై యోగ మార్గాను సారంబుగా భూ జలాకాశ వాతాగ్ని భూత ప్రపంచేంద్రియ ప్రాణ శబ్దాద్యహంకార మూల ప్రకృత్యాది వైకారితం బౌ శరీరంబు నెన్నన్ చతుర్వింశ తత్వాత్మకం బంచు తాపంబు వింశత్ ప్రపంచంబుగానెంచి షడ్వింశకం బైన నీయంశనుం జేరు సాంఖ్యాంబు

భావింతురో సామి యెగ్గేమి జాలంధరోడ్యాణ మూల త్రయీబంధ చక్రాష్టకంబై నవ ద్వారకంబై సదా దేవతల్ గాపురమ్ముండు చుండీ యయోధ్యా పురంబే శరీరంబు గా నెంచి షట్పద్మ కోద్య చ్చతుష్షడ్దశ ద్వాదశాద్యష్ట కాంత ద్విపత్రాన్విత ప్రాణి ప్రాణాక్షర న్యాస విద్యా విధిన్ కేవలానంద భాగైక భోగుల్ సదాష్టాంగ యోగుల్ స్వకీయాత్మలన్ భవ్య సారస్వతీ నాడి మార్గాను సారంబుగా ద్వాదశాంత స్థితంబౌ సహస్రార చక్రాంతర స్వర్ణ వర్ణోల్లసత్కర్ణికా పీఠ సంవాసునిన్ వాసుదేవున్ నినున్ జేరి నిర్ద్వంద్వ సాయుజ్య సామ్రాజ్య మెల్లప్పుడున్ గొల్లగా నేలు వారై సుఖం బుందు రింకన్ ప్రసన్నాత్మలౌ సత్త్వసన్నుల్మహిన్ మూలమంత్రార్థ విజ్ఞానసంపన్నులై చేతనా చేతనం బెల్లనున్ శేషివౌ నీకు నన్యార్హ శేషంబుగా చేతనుం డెప్పుడున్ దాను రక్షించుకో జాల డింకొక్కనిన్ బ్రోవగా లేడు నారాయణుం డంతరాత్ముండు సర్వాత్మ లందుండి యాయాత్మ వర్గంబు కాధారమై గ్రోలు సంబంధముల్ తొమ్మిదింటన్ విడం జాలడా దేవు కైంకర్య మే ప్రాప్య మాతండు లక్ష్మీ సమేతుండు వాత్సల్య సౌకర్య సౌశీల్య సౌలభ్య శక్త్యాది కల్యాణ సంపద్గుణావాసు డా శ్రీనివాసాంఘ్రి పంకేరుహ ద్వంద్వ మే ప్రాప్యమున్ ప్రాపకం బద్ది యేరక్షకం బంచు లో నమ్మచున్ వారి కెవ్వేళ దాస్యంబు గావించుచున్ నిర్మమత్వంబు తో సర్వ ధర్మంబులన్ మాని తా మేమియున్ గోరకన్ పుణ్య పాపంబు లగ్నిన్ జెడున్ దూల మట్లున్ దొలంగంగ దివ్యార్చిరాద్యుక్త మార్గం

బునఁ సోమ సూర్యాది లోకంబులుఁ దాటి సీమంత సింధ్వాప్లుతుం
డౌచు వైకుంఠముఁ జేరి శ్రీ శేష పర్యంక శాయిఁ సమస్తార్థ
దాయిఁ నినుఁ జేరి ధన్యాత్ములై యుందు రీ దృగ్విధ జ్ఞానముఁ
గాంచ యుష్మత్కృపా లోకనం బేకదా ! మూల ? మో సర్వ సంరక్ష !
నన్నీ క్షణం బిట్లు రక్షింప లక్ష్మీ సమేతుండ వై పక్షిరాడ్వాహనారోహణ
శ్రీ జెలంగంగ వేంచేసితీ విందు నా పుణ్య మేమందు ? నే ధన్యతఁ
జెందితి న్జాల పెంపెక్కితిఁ దివ్య భవ్యాకృతీ ! భక్త రక్షాధృతీ !
మందరోద్యద్ధృతీ ! శ్రీపతీ ! గోపతీ ! తేః నమ స్తే. నమ స్తే - నమః.

నారదా శారదా శర న్నారదాభ
చారు తర మూర్తి ! వినుము-శ్రీమీర-నమిత
వారములు కయి వారముల్ - వరుస మునుల
తో నొనర్చెను భృగువు శ్రీ శ్రీనివాసు-

ఆగతానాగత-జ్ఞాను డా మునీంద్రు
డీ గతిని ప్రార్థనల్ జేయ నాగ శయను
డాగగా రాని సదయానురాగ మతి స
రాగ బింబోష్ఠమున నగవాగ బలికె.

తాపస చంద్ర ! నీ తలపున శ్రీహరి
కపచార మొనరించి తనుచు చాల
భయ మొందెదవు ! దాన భయ శంక నీ కేల ?
నెలకొని వినుము సందియము దీర

ఘనభక్తి మై నీవు గావించి నది గాని
గర్వించి చేయుట గాదు సుమ్ము-
రాజిల్లె నాదు పారమ్య మందరికిని
దెల్ల మాయెను-మౌను లెల్ల దెలిసి
గొల్లి బుత్తురు వినుము వైకుంఠ పదవి-
యెల్లరకు నిట్టి మహిమ నీవల్ల గలిగె-
మున్ను దెలుపనె ? సనకాది మునుల యెదుట
మదపచారంబు సైతు నెమ్మది నటంచు -

నీ పదము మద్భుజాంతర
ప్రాపితమై - భూషణ ప్రభాయుత మౌచున్
జూపట్టె- సత్యభామయు
కోపమ్మున జేయ, దాన కోపించితినే ?

దాసు లపచార మొనరింప నే సహింతు -
నే సహించిన జగమెల్ల తా సహించు -
దాసులకు జేయు నపచార మే సహింప -
గాన భాగవతాప కృత్క్రమము విసుము.

భాగవతున కపచారికి
లో గాక హిరణ్యకశిపు లుంఠనమునకే
రాగిల్లి వాని హననో
ద్యోగం బొనరించితిని మహోత్సాహము తోడన్-

యాగ విధిజ్ఞ ! యింకొక రహస్యము దెల్పెద-యెవ్వరేని ఘో
రాగము నస్మదర్థము నహంకృతి జేసి కనంగ లేక శ్రీ
భాగవతాంఘ్రి పద్మముల బట్టిన నేను క్షమింతు- శ్రీమహా
భాగవతాపచార మెద బాటిల నోర్వగజాల ! వాని నేన్.

నీదు సవన మెల్ల మా దర్శనంబున
సఫల మయ్యె నంచు శంక వదలి-
వరము వేడు మిత్తు వనజాక్షు మ్రోల ని
ష్టార్థదంబు గాక వ్యర్థ మగునె ? -

అని దెలిపిన హరి సూక్తిన్
విని భృగుముని సంతసించి వేడుక ననె నో
వనరుహ లోచన ! నిను వర
మని యడుగుట కల్పకమ్ము నడుగుట గాదే ?

నన్నుఁ మన్నన జేసి దోసముల నెన్నఁ బోక సద్భక్తి సం
పన్నుండుఁ బలె వీని గాంచి పరమ ప్రాప్య స్వరూపంబు తో
ము న్నాకాశ సరస్వతిఁ ముఖము మమ్ముఁ గూర్చి గావించు మో
యన్నా ! యంచని బల్కినాడవు కృపాయత్తైక చిత్తుండవై.

ఆ సూక్తిని కణ్వాశ్రమ
భాసుర సుక్షేత్ర తుంగభద్రా నదికిఁ
గాసింత పొంత చేసితి
భూసుర తతి తోడ జన్నమును బొల్పెసగఁ-

ప్రత్యక్షము కరుణించిన
సత్యవ్రత ! నిన్ను విడువ జాలను దయతో
నిత్యము లక్ష్మి ధరణీ
భృత్యులతో నిందు నిల్వవే ! అర్చింతుఁ -

అనిన శ్రీహరి యిట్లనియె.

నిర్మల స్వభావ ! నీ మనంబున మమ్ము
పూజ సేయ గోరి భూతలమున
నిలువ మంటి వెట్లు నిలచెద "మత్స్యంచ
రూప పూర్తి" నే స్వరూప మునను ?

ఇట్లు మునిజ వర్ధమండును- అరి జన మర్దనుం డగు జనార్దనుం డాన తిచ్చిన నతి శ్లాఘ్యంబులు నర్ఘ్యంబులునై శ్రోత్ర భూషణంబు లగు భాషణంబుల సంతోష ర్షస తరంగితాంతరంగుం డగుచు మౌని పతం గుండు విహంగ పుంగవ తురంగున కిట్లనియె -

వినుము జగద్రక్ష ! వేదాంత సంచార !
పుండరీకాక్ష ! సత్కుంపలీంద్ర
శయన ! రమానాథ ! శంఖ చక్రాసి శా
ర్ఙాయుధ ! శ్రీ శరత్తోయజాక్ష !
విశ్వతో ముఖ ! పరమైశ్వర్య ! శాశ్వత !
కనక పీతాంబర ! కామితార్థ
ఫలద ! కస్తూరికా తిలక లసత్ఫాల !
నీల కుంతల ! యింద్ర నీల శకల !
లలిత విగ్రహ ! సర్వంబు దెలియు నీకు
దెలుప దగు వారలెవ్వరు ? తెలిసి తెలియ
కొక్క విన్నప మొనరింతు నోర్చి వినగ
దయ్య ! కృప తోడ గాంచగదయ్య ! మమ్ము -

పరము భజింపఁగ జాలను-
సరగున వ్యూహంబు లకును జన్న జాలను మీ
వర విభ వాంతర్యాముల
నెరుగము-"అర్చాస్వరూప" మెలమిని శౌరీ !

పండితుల కేమి ! పామర ప్రతతి కేమి ?
ముని వరుల కేమి ? దేవతా జనుల కేమి ?
పూర్ణ షాడ్గుణ్యమున నొప్పు పొలుపు మీరు
నట్టి "అర్చావతారంబు" నవధరించి -

కలుముల చెలితో క్షితితో
పులుగుల యెకిమీని తోడ "క్రోదిన రాబా
రులకుఁ" నెలవగు నిచ్చట
నలరగ "క్రతువేది" నిలువు మర్చింతు నినుఁ -

ఘన వికుంఠ పురం బేడ ? కర్మభూమి
కణ్వ నాశ్రమ మేడ ? శ్రీ కలిత రత్న
మండపంబేడ ? యీ యజ్ఞ గుండ మేడ ?
రా ననగ లేవు భక్తు నధీన మీవు -

శ్రీ రుచిరంబు నై-పరమ సేవ్యమునై-జెలువొందు సుందరా
కారము జూడ "కొక్క త్రుటి" కల్ప శతంబయి తోచుచుండు - నీ
వారము-గా-మదిం-దలచు వారము గాన-మునీంద్రు లిచ్చు నీ
వార హవి ప్రదానము లవారిగ జేకొన వే దయాంబుధీ -

అంతరింద్రియ ముల నఖిల మంతర్యామి
సేవ కర్త ములుగ జెలగు బాహ్య
కరణములను మీకు కైంకర్య మొనరింతు
నవధరింపు మర్చనాది విధుల.

శౌరి ! మీ రిపు దర్చావతార మూని
సేవ సాయించ మని ముని శ్రేష్ఠవరుడు
వేడుకొన నాక్షణంబ. శ్రీ విభుడు - సర్వ
రక్షక విలక్షణాకార రమ్యు డగుచు.

కమనీయ పాంచ జన్యము దక్షిణ కరాబ్జ -
మవలి కేల సుదర్శనాయుధంబు -
కటి కయిసేచిన కర పంకజంబున
కౌమోదకియు - సురేఖల దనర్చ -

"అభయ" ప్రదాన హస్తంబు - వక్షస్థ
లాంచిత కౌస్తుభహార యజ్ఞ
సూత్రంబు - కటి తట శోభిత పీతాంబ
రంబును - పాద కంజంబు లందు
కటకములు - మేఖలోవర ఘటిత బంధ
నంబు - భుజ కీర్తులును - కిరీటంబు - కుండ
లాయుధా భరణాదుల - నమరి - పూర్ణ
శశి నిభాననుడై - మునుల్ సంతసింప -

మరియు గంభీరాంభ స్సముద్భూత ధృఢ నాళ కల్యాకాల విలసిత సితాంభోజనేత్ర యుగళుండును - కంబు సన్నిభ గళుండును - మృదు మందహాస విలసిత బింబికా ధరుండును - శ్రీధరుండును, - సజల, జలద, వర్ణుండును, - శ్రీకార విలసిత కర్ణుండును, - శుభ్ర శ్వేత మృత్స్నా విభ్రాజమాన చిద్రోర్ధ్వ పుండ్ర మధ్యగాష్టాపద రేఖా సముల్లసిత ఫాలుండును,- నీల కుంతల జాలుండును,- మదన కోదండాయమాన సు భ్రూ విలసితుండును- దయా,కలితుండును, - లక్ష్మీ విలసిత విశాల వక్షుండును - సర్వ దేవతాధ్యక్షుండును,- దిగిభరాజ శుండా దండ మండిత దీర్ఘ బాహుండును,- నీల జీమూత దేహుండునూ,- గంగా,తరంగ సంగత మంగళ త్రివళీ యుతోదరుండును,- నాభికావర్త సుందరుండును,- అమలిన పులిన శ్రోణీ తలుండును,- భక్త జన శీత

లుండును,- కర్పూర కదళికా కాండోరు మండలుండును,- వైభవ జితా ఖండలుండును,- సూన బాణ తూణ జంఘా యుగళ విరాజితుండును,- ముని జన పూజితుండును,- విమల కమలాకర విలసిత కమలా కర కమల లాలిత పాద కమలుండును,- సుగుణ విమలుండును,- దయా సముద్రుండును,- నిఖిల భద్రుండును,- శత్రుమర్దనుండగు జనార్దనుండు సాకారంబున మౌని యభిమత ప్రకారంబున నప్పట్టున జూపట్టిన –

త దనుకూల వృత్తి దనరి శ్రీ ధర విర్వు
లబ్జ ముకుళ హస్తు లగుచు ప్రభల
వెలసి విలసితాంగములను కాంతులు నిండ
నెలమి నిలచి-రప్పు డిరు గడలను-

పంచ భేదములను మించిన పంచాయు
ధాంచితుని "జనార్దనాఖ్యు" పంచ
బాణ పంచబాణు భావించి సద్భక్తి
నధికరించి మోహితాత్ము లైరి-

సవ్యేన చక్ర మపరేణ కరేణ శంఖం
భక్తాభయప్రద కరం గదయా సమేతం
శ్రీ భూ యుతం వికసితాంబుజ నేత్ర యుగ్మం
సేవే - జనార్దన హరిం-సుర బృంద వంద్యం.

శ్రీనివాస మాదితేయ శేఖరేంద్ర సేవినం
వీనకేతనం పరం నదీన సన్నికేతనం
మౌని మానసాంబు జాత మందిరం హరిం భజే
మాన వాద మాన వాద మర్దనం జనార్దనం.

నౌమి మోక్షదం సుహృన్మనస్సరోజ షట్పదం
కామకోటి సుందరం దరాభిరూప్య కంధరం
శ్యామలాభ్ర కోమల ప్రశస్త కాంతి మేదురం
మా మనోహరం మురారి మర్దనం జనార్దనం.

నక్ర కుండల ప్రశోభి నవ్య గండ మండలం
శుక్ర కీలి కోజ్జ్వల ప్రశస్త చక్ర విక్రమం
శక్ర శర్వ ముఖ్య దేవ చక్ర సేవితం ద్విజ
న్మక్రతు ప్రభోక్త వైరి మర్దనం జనార్దనం.

నారదాది బ్రహ్మవాది నాథ యూథ నన్మన
స్సారసాంతర ప్రవిష్ట సార సారసం - దయా
సార తోషితాత్మ వర్గ సస్య సంచయం ప్రియం
మారకోటి సుందరం నమామి శ్రీజనార్దనం-

శ్రీ ధరం ధరోద్ధరం వసిష్ఠ బాదరాయణా
యోధ నాశనాది మౌని యూధ బోధ సాధనం
భూ ధరాత్మజాధినాధ ముఖ్య సాధ్వబాధనం
మాధనం భజామి శత్రుమర్దనం జనార్దనం.

నీల నీల కాంతి కాంత నిర్మలాలకోజ్జ్వలం
ఫాల లాలి తోర్ధ్వపుండ్ర భాసురం జితాసురం
నీలకంఠ ముఖ్య దేవ నీల కంఠ కంధరం
బాల గోప కుర్దనం సమాశ్రయే జనార్దనం.

నిర్మమార్య పాద పూజనీయ పాద పంకజం
దుర్మదాంధ రాక్షసేంద్ర తోయద ప్రభంజనం
కూర్మ రూపిణం ఫణీంద్ర కూటశాయినం నమః
కుర్మహే జగత్రయైక కుర్దనం జనార్దనం.

పావనం సమస్తలోక పావనం సుపాదరా
జీవ నమ్ర ధీ విశేష శేష భూత జీవనం
సేవనం మహాత్మ నామ శేష పోష ధావనం
భావనాభిధాన మాశుభావయే జనార్దనం.

విత్తమస్తు యస్సుగంధి వృత్త నామకాష్టకం
చిత్త శుద్ధితః పఠే ద్విచిత్ర శబ్దగం త్విదం
విత్త పుత్ర పౌత్ర మిత్ర వృద్ధిదం శుభ ప్రదం
హృత్తమోప మర్దనం హరిం భజే జనార్దనం.

హృద్యములగు నీపద్యము
లాద్యంబై సకల సన్మహా కవి జనతా
వేద్యములై సంతత నిర
వద్యములై వెలయు-శ్రీనివాసుని దయచే-

అమ్ముని శ్రేష్ఠు డిట్లు ధ్యాన మ్మొనర్చి
స్వామి ! నీవాడ నౌటచే చనువు మీర
విన్నవించెద దెల్పు మేవేవొ ? నీదు
గోత్ర సూత్రాది నామముల్ కోర్కె లమర.

అనిన వాసుదేవుండు నగుమొగంబున మునీంద్రుమొగంబు పై చూడ్కి నిలిపి ఋషి కులోత్తమా ! అస్మత్కుల గోత్రనామంబు లెరుంగ నెవ్వరి వశంబు ? నే ననంతవేద శాఖాధ్యయన సంపన్నుండ-ననంత గోత్ర ప్రవర్తకుండ-ననంతసూత్రాను ష్ఠాతుండ- ననంత నామధేయుండ-నగు నాకు వీటి వీటి యందొక మితంబు లేదైనను "అర్చావతారంబు"న

నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ వర్షోత్స వాదుల యం దచ్చటచ్చట మన్నామ గోత్రంబు లుదహరించ వలయు గాన దెల్పెద - మదీయ నామంబు జనార్దన దేవుండ - భారద్వాజస గోత్రుండ - రోహిణీ నక్షత్ర జాతుండ-యజుశ్శాఖా ప్రవర్తన పరుండ-మత్ప్రతి ష్ఠాది కృత్యమ్ములు వైఖానస సూత్ర ప్రకారంబునఁ ప్రవర్తింప జేయ వలయు - నియునుం గాక శ్రీ విఖనస మతాను సారంబుగా కర్షణాది ప్రతిష్ఠాంత క్రియా ప్రయోగ సౌకర్యంబును, ప్రతిష్టాద్యుత్యవాంత విధానానుకూలంబును,- యుత్సవాది నిత్యార్చన పర్యంతశోభితమ్ము నగు శత సహస్ర పరిమితంబగు మహత్శాస్త్రం బార్య జన నేత్ర శ్రోత్రానంద కరంబుగా కల్పించి తదుక్త ప్రకారంబున సర్వంబు నెరవేర్చ గల మునికుమారుల గూర్పుము—తత్కైంకర్యంబు లొనరించు నెడల శ్రద్ధా భక్తి సమన్వితుండవై మమ్ము సేవింపుచు హృదయారవిందమ్మునఁ భావించి ద్వాపరాంత పర్యంతంబు మత్సన్నిధిం బాయక నివసించి కలియుగంబున సన్నిహిత పర్వత గుహాంత రాళంబున విశ్రమ్మించి తపం బొనరించుచు సకల కలి మనుజ నయనాగోచరుండవై-యప్పటప్పటికి మమ్ము సేవింపుచుండ వలయు భవదధీతంబగు శాస్త్రంబు భృగు ప్రోక్తం బనం బరగి మధ్య జనంబుల యాజక జనంబుల కత్యంతోపయుక్తంబని యొసతిచ్చి ; మరియును —

యుష్మ త్క్రృత "సంహిత" య
ర్చిష్మంతుని కరణి సుజన సేవ్యంబై—"అ
ర్చిష్మంతంబై"-దీర్ఘా
యుష్మంతముగాగ నెపుడు నుండును భువిలో

ఫలమైన పత్ర మైనను
సులలిత సలిలింబు నైన సుమ మైనను మా
"లలితార్చాకృతి" నెవ్వడు
దలచుచు నర్పించు ? మత్ప్రదం బత డందుఙ్ -

తా నతిపాపి యై పథము దప్పిన మానవుడైన నాదుక
ల్యాణ మహూత్సవమ్ము నకు హర్షముతో జనుదేరి దారి తా
నూనిన పాద పాదమున కొక్కొక సత్క్రతు వాచరించు పు
ణ్యాను-భవైక భోగి యగు నాతని భవ్యత నేమి జెప్పదుఙ్ ?

కపిల గో ఘృతమున ఘటిక మాత్రం బైన
దీప మిడిన వాని పాప సమితి
భాస్కరోదయ మున బాయు చీకటు లట్లు
దూర దూరము లకు దొలగి పోవు.

ధని పుణ్యు డందు వలనఙ్
గను స్వర్గ సుఖంబు నెన్నగా దరుగును ని
ర్ధని యైన మత్ప్రదక్షిణ
మున నా సన్నిధి వసించు -పుట్టడు మరలఙ్ -

అంబుజంబులు వేయి-నతి సుగంధము లైన
నీలోత్పలములు వేవేలు-కుంద
సుమములు లక్ష-భాసుర తర పున్నాగ
ములు కోటి-జాజులు పొలుపు మీర
కోటి కోటులును-వకుళములు దోసిళ్ల
కొలదిని-సంపెగల్ గొజ్జగులును
గంపల పరిమితి గల గేదగులును-చా
మంత్రులు పుష్పాది-మహిత గరుడ
వర్ధనమ్ములు గన్నేరుల్ వలసి నంత
ప్రోవు లైనను-మ త్పదాంభోరుహముల
నిక్క మగు భక్తి నర్పించు నొక్క తులసి
కా దళము నకు సరి జెప్పరాదు సుమ్ము -

మునీంద్రా ! మదర్చావతారంబు పర వ్యూహాదుల కంటె నతిశయ ఫల ప్రదం బగుటకు కారణం బేమనిన ? జెప్పెద-నాకర్ణింపుము—

రాజ పుత్రుడు తన రాజ్యమ్ము విడి మృగ
యారతి నన్య వనాంతరములు
దిరుగుచు ఛత్ర చామర గజాందోళికా
ధ్వజ భట సముదయ తతి దొలంగి -

వేటాడి యెండల విడిబడి క్షుత్ తృష్ణ
ప్రబలి యొక్కెడ నున్న-వాని నొక్క
మమజుడు గాంచి నెమ్మది శీత లోదకం
బన్నంబు నిడి తన నావరింప -
మరలి గొలువైన యపుడు తన్మనుజు బిలిచి
యభిమతం బిచ్చి నటుల నర్చావతార
కాలమున నుపచార మే ఘనుడు జేయు ?
నాతనిని గారవింతు లోకాంతరమున -

పరుని నన్ను నిన్ను ప్రత్యగాత్మగ నన్ను
దర్చనం బుపాయ- మధిక ఫలము
మత్సమీప వసతి మదము విరోధిగా
గనుము నర్థ పంచకంబు నీవు

కలిని నర్థ పంచక జ్ఞాన మెరుగంగ
నూటి కొకడు - వేయి నూర్ల కొకడు-
లక్ష కొకడు - వేయిలక్షలకొక-డైన
కలుగు టరుదు-నన్ను గాంచు టరుదు-

ఓయి మునీంద్ర! సంతతము నుత్తమ సత్కృప నిచ్చునట్టి యీ
నా యుపదేశ మెయ్యెడ మనంబున గాఢ సమాధి మై మమున్
బాయక దల్చుచున్-ముని కుమారుల కెల్ల మహోపదేశముల్
జేయుచు జేరు మమ్ము-నిను జేరిన వారల నెల్ల జేర్చుచున్ -

తెలుప దగిన వెల్ల తెలిపితి నింకను
దెలుప వలసి యున్న తెలియు మిప్పు
డడుగ వేని యెప్పు డడిగిన నీతోడ
నుడువు వాడ నేను-తడవు సేయ -

అనుచు బల్కి నట్టి హరి సూక్తి కర్థామృ
తంబు సేయ - సవన తంత్ర పూర్తి
తగ నొనర్చి-"అవభృథస్నాతుడై"-ద్వాద
శోర్ధ్వ పుండ్ర రేఖ లుంచి మించి -

తమ్మి పూసల పేరుల దాల్చి సాంధ్య
కృత్య మొనరించి యష్టాక్షరీ జపంబు
తత్త్వదర్థ విచారంబు ధర్మ నిరతి
సర్వమును నెరవేర్చి కేశవుని కెరగి-

బంగరు గిన్నెలున్ స్నపన పాత్రలు గిండులు "తీర్థబిందె" లుఁ
రంగమరంగ భాజన పరంపర నర్చన పళ్లెరంబులఁ
మంగళ దీప సంతతి సుమంబులు సర్వము మౌని రాకకుఁ
ముంగల నే సమస్తమును మొల్చిన యట్టు-లమర్చి-యుండగన్

నమ్రుఁడై ప్రదక్షిణ మ్మాచరించి శ్రీ
మాధవార్చనార్థ మైన కూర్మ
పీఠి గూరుచుండి ప్రేమ ప్రాణాయామ
మునను కాల దేశముల గణించి -

శ్రీ కర నవరత్న సింహాస నార్ఘ్య పా
ద్యాచమనీయ పంచామృతాభి
షేక పీతాంబర శ్రీగంధ తులసికా
దళ పుష్ప ధూప సులలిత దీపి
కా హవిః పానీయ కర్పూర తాంబూల
మహిత నీరాజన మంత్ర పుష్ప
"చామరాదీని" "యుష్మత్ప్రియార్థ"మ్మయా
సంకల్పితా"న్యభీష్టప్రదాని"

విహిత సర్వోపచారా "ణ్యవిస్తృతాని"
పరమ కృపయా "గృహాణ" శ్రీపద్మ నయన -
"భవదధీనోహ " మధిప మాంపాహి-యంచు
సన్ముని త్రికాలముల పూజ జరుపు చుండె-

కణ్వముని యాదిగా మౌని ఘనులు గూడి
విష్ణు సేవించు వారు భావించు వారు
కీర్తనలు సేయు వారు ను - గేరువారు
నగుచు నానంద మున నోలలాడి రపుడు.

అని సూతు-డబ్జ జామర
ముని వర్యుల తోడ దెలుప-మోదము తోడన్
విని-శౌనకాదు-లవ్వారి
వన జాక్షుని కథ వినంగ వాంఛించుటయుణ్.

నిట్కాంతాతప కాశ నిర్జర నదీ నీకాశ కీర్తీ- ! దిశా
రాట్కోటీర సదబ్జరాగ మణి విభ్రాజాంఘ్రి యుగ్మాంబు రు
డ్జుట్కల్యాణ సుపాదుకా ద్వయ రజశ్శుద్ధాత్మ వర్గాంగ ! ప్రా
వృట్కాలాంబుద ధామ ! దేవ ధరణి భృద్ధైర్యసారక్షమా.

ప్రకట సహ్యజాత రంగ భంగ వారిసేక - శ్రీ
శుక పరాశ రాంజనేయ శూలహ స్త దాల్భ్య శౌ
నక ముఖ ప్రశస్త భక్త నాథ వందితాత్మ - ద్వా
ర కలిత ప్రశస్త గోపుర ప్రయుక్త మందిరా!



# (తృతీయాశ్వాసము)

శ్రీ మహితధామ ! శిష్టనుత
నామ ! మహారంగపట్టణ రమా కలితో
ద్దామ ! యశః పరిభూత సు
ధామ్మృత కర సోమ ! వైజయంతీ దామా !-

అవధరింపుము నారదుం డబ్జభవున
కనియె-శ్రీహరి యిట్లు కణ్వాశ్రమ మున
నధివసించిన పిదప దివ్యాల యాదు
లెవరు నిర్మించిరి ? ఖగేంద్రు డెచట నుండె ?

శ్రీ విలస న్మధురోక్తుల
దేవా ! నీ వాని కిపుడు దెలుపుము కృప చే
నావిని చతురాస్యుడు దయ
దేవ మునీంద్రునకు సన్మతిఁ బల్కె వెసఁ

శారదాభ్రగాత్ర ! శారదా పుత్ర ! వి
శారదుడవు గా క శారదుడవె ?
నారదా సనార నీరద వస్తుని
చారు కథల చెవుల చవుల వినుము.

ఈ గతి యమ్మహాత్ము హరియే గతి యంచు దలంచి - నెమ్మదిఁ
భోగ విరాగుఁడై - సతతముఁ బరమార్చన కృత్య మందు - సం
యోగ మనస్కుఁడై-జరుపు చుండగ - నంతట నంత నంత వ
ర్షాగమ మేగుదెంచె - సఖిలాగ మనో వ్యథ లెల్ల దీరగఁ-



# వర్షఋతు వర్ణన

తనకై యొక్కెడ జేర దవ్వనధి జాతఁ గూడి దానింట నుం
డును నారాయణుఁ డంచు నెమ్మదిని గుందుఁ దాపముఁ బూన త
ప్తన కాయుం దరుదెంచి తాప మెరియంగా రాగ పన్నీరు జి
ల్కె ననఁ దొల్కరి నప్పటప్పటికి బొల్చెఁ వాన జల్లుల్ భువిన్

అభ్రము లను దొరగి యవనికి వ్రాలెడి
కరక లొప్పె కాల కర్షకుండు -
వృష్టి ధారలెల్ల మ్రింగు చాతకముల
దూఢి వడిసెలలను రువ్వె ననగ -

హరి నీల దివ్య దేహ రుచి ప్రవాహమో ?
యన నొప్పు కాల మేఘౌఘములును-
చక్రి శ్రీహస్తాబ్జ చక్ర ప్రభాజాల
చక్రమో ? యను నట్టి చంచలలును-
పద్మాదినాథు శ్రీ పాంచజన్యో ద్భూత
రవముల మించు గర్జా రవములు-
కంజాక్షు భవ్య శార్జ చ్ఛాయలను బోలు
సలలితంబులు నింద్ర చాపములును-

దనరి నారాయణుని దివ్య తర కటాక్ష
ధారలో ? యన - వర్ష విస్ఫార వారి
ధారలను కర్షకానంద కారి యగుచు
శ్రీల జెన్నొందు తద్వృష్టి కాల మపుడు.

కురిసెఁ జడి-వర్షా భూ
త్కార రవము జెలంగె-జాజి తతు లిల బూసెఁ
మెరసె శిలీంధ్రము లంతట
ధర హరి హరి శబ్ద ముఖరితం బై జెలగెఁ-

హరి శబ్దమే మహా హరి శబ్దమై తోచె
కాంతు లొల్లని కరిగమనలకును-
చంచల లే మనశ్చంచల లై తోచె
నధిపు జేరని హంస యానలకును-
దుర్దినంబులు నెల్ల దుర్దినంబై తోచె
వరుడు జూడని పతివ్రతల కెల్ల-
వర్షకాలమె దివ్య వర్షంబు లై తోచె
రమణు సంగతి లేని కమల ముఖికి-

జాతులెల్లను గనగ దుర్జాతు లయ్యె-
పతులు కోపింప సత్కులసతుల కపుడు-
యెంత సిరి గల్గినను భుజియింప లేక
పాలు మాలిన ధర భాగ్యవంతు లట్లు-

అంబర క్షీర వార్నిధి యందు గోర్కె
కుండలీంద్రుని శయ్యపై బండి యున్న
పుండరీకాయతాక్షుని బోలుపు మీరి
చండకరు డుండె పరివేష మండలమున-

తాప హర మగుచు భువనో
ద్దీపిత మై-నీల కాంతి దివిఁబర్వ కృశ
గ్వాప్థదమై - వామన
శ్రీపాదం బట్లు జెలగె జీమూత మొగిన్ -

నదులు యమున లయ్యె-నరులు విష్ణువు లైరి -
నగము లెల్ల నీల నగము లయ్యె-
భూము లెల్ల కృష్ణ భూము లయ్యెను-శ్యామ
లాభ్ర పంక్తి మిన్ను నావరింప-

ప్రాగ్వాతమ్ములు వీచె-బెల్లు మొరసెన్ భద్రమ్ములై మేఘముల్-
దృగ్వీథుల్ మిరుమిట్లు గా మెరసె బ్రోదిం చంచలల్- వే మరు
ద్భుగ్వాతమ్ములు వ్రేల గట్టినటు లంభోధార లుర్లెన్- మనో
రుగ్వేదండము లెల్ల వాసె కరణీ రూఢానురాగమ్ముగన్-

మరియు నూర్ధ్వ ప్రసారిత వామన పద తలమ్మున వియత్తలమ్ము భేదిల్ల తచ్ఛిషిర ద్వారమ్మున వియద్గంగానీరమ్ము భువికి జారవచ్చెనో ? యను నట్టుల గురియు కుంభవృష్టికి నిట్టట్టుదోల వీలుగాక కట్టుకంబుల గట్టినట్టుండు పశువులకున్ కసవులుగొనిరా గలుగు చేడియలన్ బనుప యేగుతరి దారితల దుక్కి-చేలన్ బడి దల్లులతోడన్ గ్రేళ్లరకన్జాలని లేళ్ల గ్రుంగినకాళ్లన్ బెల్లగిలనెత్తి తల్లిపిల్లలన్ గలుపుచు నలుపుగదిరి ముదురుతీగె లిడు గాదంబుల మోదంబులన్ గ్రోయుచుమ్రోయుచు నంత కంతకునతిశయించు యీదురుకు బెదరిగట్టిగ గట్టిన ఫలాసంబుల మోపుల మూపుల నిడుకొని యిల్లు జేరు పల్లవాధరుల పెల్లు జల్లులన్ దొప్ప దోగు కప్పుగొప్పుల విదిర్చ నెరుల బారులంగని తమ వారలవి జేరు పెంపుడు నెమళ్ళ కేకలు కృక వాక కూజితంబులని గృహ కృత్యంబులకు కోడండ్ర కోపగించు ముదుసళ్ళ కుక్కి మంచంబుల కథ నిడు గుంప టుల దంపతి శనగలు దిను బిల్లలన్ కూక లిడుదల్లుల నదలించి పల్లె కూటంబునన్ జదివి గద్దరి పద్దెమ్ముల ముద్దు లెనగన్ జదివించి ప్రొద్దు పుచ్చు కాపుపెద్దల వద్దజేరి మైనాకు లేగలన్. గని నంభారవంబు లిడు ధేనువులన్ గలిపి బితుకు పయోధరా ధ్వానంబులు పెవిసోక పరిచారికలన్

బుచ్చిన పెంపుధర కైనన్ గొని తెచ్చిన క్షీరంబుల కణుపు నిప్పుల నొప్పునన్ గాచిన తమి మేడ పైనన్ బండు పతుల కతికుతుకంబునన్ ద్రావగ నిచ్చు భాగ్యవతుల కతులానురాగంబున సగం బిచ్చినన్ గొని జారున్ జారు నీర ధారల గవాక్ష ద్వారమ్ములన్ జాచిన చేరలన్ గొని బుక్కిలించి నుమియు చక్కెర బోండ్ల చక్కని కరకంజంబుల వేడుక నుంచిన కంకణంబుల గల ముక్తాఫలంబు లధర బింబరాగంబున పద్మ రాగంబులని భ్రమసి నటులన్ గూర్మి జెయి బట్టుకొని నిట్టట్టన జాలక గట్టి మనంబుల జాల్గొని గలసి వర్తించు కామినీ కాముకుల సుఖంబు శ్మశ్రుక్షౌద్రంబు వలె క్షుద్రంబనియు గేహంబులు స్రవద్గేహంబు లనియు గృహ పంకంబు లాత్మపంకంబుల శుద్ధి యని యు జ్జ్వలనంబుల మంధ జ్వాలికలు జ్ఞాన సంకోచం బనియు - ఆర్ద్ర పటంబులు కపట మానసంబులనియు, తాత్కాలికానుభవంబు నుపదేశిచు దేశికోత్తముల సపర్యల కుపయుక్తంబగు సమిత్పల కుశాదుల దేర జను మునికుమారుల పయిన్ గప్పు పులి చర్మాంబరమ్ములన్ గని పులులని జంకు గదుర హొంకంబులగు మహోక్షంబుల బెదురు దీర్చుచు దున్నిన మెట్టచేల జల్లిన బీజాంకురంబుల బెల్లగించు శుక శారికాదులన్ దోల కావలిడు బాలికా వ్రాతంబుల గీతంబుల కనుగుణంబుగా సమీప కేదారంబుల నూడ్చు నూడ్పుగత్తె లుచ్చైస్స్వరంబుల జేయు గానంబుల కుబ్బి గొబ్బున నారు బిడియ లందించు గృషీవలుల చే దీర్చబడు చీలు కాలువల నంటిన తటాకంబుల నలుగులన్ బారు ప్రవాహంబులు మార్గంబుల కడ్డంబై ప్రవహింప కాల్నిలుపన్ జాలక బుక్కిళ్ళకు

వెక్కసంబు లగుట నొకరి నొకరిన్ బట్టుకొని గట్టు జేర పథికు లధిక క్షుధన్ గనుపట్టు పంటచేల గంకెకంకుల నుంకించి త్రుంచు నెడ నదలించు మంచెలం దిగి యుద్గమించు చంచలాక్షుల నడల వంచింపం బడిదివికిం జను రాయంచలో ? యన నాకసంబున బారులు గట్టు సారసంబులకుగోళ్ళు జూపన్ గేళ్లురుకు పిల్లలతుషార వర్షంబులన్ దడిసిన తడితలల పయ్యెదలన్ తుడుచు తొయ్యలులన్ గని "పయోధరంబు లంబరంబునన్ దొలంగ నెన్నటికి గంటి" ? మని భావగర్భంబుగా బలుకొకళ్ళ నొకళ్ళ బలుకులకు నవ్వు వన్నెలాడుల నగవు కన్నె వెన్నెలకు బ్రసన్నం బై నవో ? యను విధంబగు దిశలుం గల్గి భాగ్యవదాల్బికా శిరః ప్రదేశంబునన్ బోలె కేతకీ రేఖాభిరామం బై - పిశున ప్రచారంబునున్ బోలె కల్మషజీవనంబై విశ్వౌషధీ మహానసంబునుంబోలె సకలార్ద్రికంబై -స్వర్గపురంబునుం బోలె ప్రకటితేంద్రగోపంబై -సింహాచలక్షేత్రంబునన్ బోలె సకృద్ధరి దర్శనంబై - భగవదుత్స వారంభ దినంబునుం బోలె ప్రకటి తాంకురారోపణంబై -విప్ర వివాహంబునుం బోలె అవిభావితాహోరాత్రంబై - కృతయుగంబునున్ బోలె నతివర్షంబై యుండె - నాసమయంబున —

శ్రీజనార్దన హరికి నేయోజ నర్చ
నాది కైంకర్య మొనరింతు ? ననుచు-నంబు
వృష్టి నార్ద్రాంగుడైన శ్రీవిభున కిట్లు
బలికె నీరద గంభీర వచన ములను.

శ్రీలలనా మనోహర ! వచించెద-మీకొక విన్నపంబు-ది
వ్యాలయ మంటప ధ్వజ మహత్తర గోపుర పాకమంది రో
త్తాల విమానముల్ గలగ దల్చవె ! నెమ్మది మీకు మాకు మె
చ్చె ? లలితాబ్జ ధార లభిషేకము-సభ్యులు జూచి మెత్తురే ?

అర్చ కభిషేకమునకు పంచామృతములు
క్షీరములు ఫల రసములు నారికేళ
జలము సీరక చోరక సలిల ధార
గాక - కేవల వస్త్రంబు కఱము లగునె ?

"సాతపైస్సేచనం" దివ్య మనెడి గుహ్య
సూక్తి మానవులకు గాక సురల కగునె ?
అందు నర్చావతారంబు నతి పవిత్ర
మధిక మగు సౌకుమార్య మహత్తరంబు -

అనుచు పరభక్తి శౌరి పాదాంబుజములు
మానసాంభోజమున నిల్పి మౌనిచంద్రు
డాదరము తోడ వేడ-కృపార్ద్ర చిత్తు
డగుచు - సర్వంబు గల్పించె నాక్షణంబ -

ఘన విమానంబు శ్రీకర గర్భగేహంబు
నంతరాళికము సొంపమరుచున్న
ముఖ మండపంబు తన్ముఖమున తెరసాల
సురుచి రావరణ సంశోభితంబు -
గాలిగోపురము శ్రీ కలిత ధ్వజస్తంభ
యజ్ఞ శాలలు పచనాలయములు -
నృత్త గీతా స్తోక కృత్య సాలంకార
మందిరంబులును - శ్రీమహిత తీర్థ
పుష్కరంబులు-మరియును పుష్పి తోప
వనులు-రథ శాలలును-దివ్య వైనతేయ
వాహనాదుల - నిలయముల్-వన్నెకెక్కి
కనుల పండువు గా నందు గానుపించె -

కమనీయ కర్పూర కదళీ లసత్పూర్ణ
కుంభ విభ్రాజిత స్తంభములును -
బాల చూతాశోక పల్లవ కల్పిత
తోరణ విలసిత ద్వారములును -

రమ్య ముక్తాఫల రంగవల్లీ చిత్ర
విలసన్మణీమయ వేదికలును -
భవ్య సుధాగార పట్టాంబర నివాస
మండితాలంకార మంటపములు -
పావన స్ఫాటికోపల భ్రాజమాన
దివ్య సోపాన పంక్తుల దేజరిల్లి -
సర్వ జన నేత్ర రమణీయ వర్వ మగుచు -
దనరె-"వైకుంఠమందిరమ్మనకు" నెనగ-

కనుగొని ముని తన మనమున
బెనగొను హర్షమున భక్తి బేర్మిని హరి పా
వనమగు కైంకర్యంబున
కనుగుణముగ శౌరి కరుణ నమరిన దనుచున్

దిశలు దిలకించి హర్షాబ్ధి దేలి యంత
చిత్రమిది ? యని యాలయ సీమ జొచ్చి
సాగి సాష్టాంగ మొరిగి నా స్వామి ! నీదు
శక్తి నూహింపలే నంచు-సన్నుతించె -

కంటిని నిన్ను దివ్య మణి కాంచన హార మహోజ్జ్వలరత్న ఘ
మంటప గోపుర ధ్వజ విమాన సమన్విత వైభవంబు దే-
పంటవలంతియుఁ సిరియు పార్శ్వములందు వసించు చుండ భూ
వింటివౌరఁ హసించు నిజవేమని సంతత సత్య భామలఁ -

నిర్విఘ్నమ్ముగ వెలుగుచు
సర్వాసేహముల పంచశర జనక మహా
పర్వోత్సవములు మునులు సు
పర్వానీకములు భక్తి భావింపగఁ -

గర్భగేహంబు గళము శేఖరము శిరము
మంటపము కుక్షి పాదముల్ మహిత గోపు
రంబు గరుడ ధ్వజంబు జీవంబు - జాను
జంఘలావరణము నీకు సరసి జాక్ష -

ఇట్టి దివ్యాలయమున శోభించు నీకు
శీతలా మోఘ వాత వర్షాత పాది
బాధ లెన్నడు గలుగవు - భక్త జనులు
సేవ జేయంగ సుఖివై వసించు మిచట -

నిర్జిత దైత్య ! నెమ్మది గళింపగ తావక దివ్య గేహ స
న్మార్జన సానులేపముల మాటికి ముగ్గు లొసంగు నట్టి పు
ణ్యార్జిత మానవుల్ సతత మబ్జ భవాదుల కందరాని వి
స్ఫూర్జిత దివ్య భోగముల బొందుదు రేమను దచ్యుత స్థితిన్?

శ్రీనివాస నీ విమాన మంటప గోపు
రాదు లరుణు నుదయ మందు నెవ్వ
రేని మేలు గాంచి తోనె సేవించిన
వాని పుణ్య మెన్న వశమె ? మాకు -

వినయమున దివ్య గేహం
బునకు ప్రదక్షిణ మొనర్చి మోదమ్మున స
ద్ఘన గరుడ ధ్వజ మంటప
మున మ్రొక్కిన వాడె పుణ్య పురుషుడు భువిలో.

నయ మార్గైక విచార ! నీ దగు విమానం బిట్లు గల్పించి మా
నయనంబుల్ సఫలం బొనర్చితివి నెన్నన్ శక్యమే ! మీకృపన్
భయ భక్తుల్ మది మించ నీ యెడ నొనర్పన్ బూనితి సుద్ది స
త్ప్రియ భావంబున చిత్తగించు పరమ ప్రేమాభిలాష స్పృహన్-

దాసుడు సఖుండెక్కుడు సిం
హాసనముఁ గేతనమ్ము వ్యజన మ్మగుచుఁ
భాసిలు నీ గరుడుని యెడ
బాసిన మానసికి పరమ భాసుర మగునే?

అదియునుం గాక నీ తోడ నరుగు దెంచె
భాగవత శేఖరుడు మాకు పరమ గురుడు
గరుడు నెడబాసి మనలేము గాన విని
నెచట వసియింపఁ జేతు మహీన శయన!-

అనిన నమ్మునివరేణ్యునకు దేవతాగ్రగణ్యుం డిట్లనియె:

ఓ ముని చంద్ర! నీవిటు మహోత్తమ బుద్ధిని మమ్ముగాంచి ని
ష్కాముఁడ వయ్యు సమ్మతి సకాముని వోలెను వేడుకొంట స
ర్వామర లోక పూజ్యుని ఖగాధిపు నిచ్చట నుంచ గోరి తే-
సామి! యెఱుంగ దెల్పు మన-నంతస మందితి తెల్పెదంతయుఁ

మాకధికులం మాభక్తులు
మీకుఁ మాకంటె వారు మిక్కిలి యధికుల్-
గాకను లొజ్జగుదురె? ముని
లోకవరేణ్య! సమస్త లోక శరణ్యా-

అయుత మదీయాలయముల కన్న గణింప
నొగి భాగవత గేహ మొకటి లెస్స -
సరవి నస్మత్పదార్చా విధి కధికఫలౌ
నరయ మద్దాస జనార్చనమ్ము -
సిరిమించు మామక సేవకన్నను పరి
శీలింపగ తదీయ సేవమేలు -
అమలాస్మదీయ గుణాను భవము కన్న
వరము మద్భక్తాభివర్ణనమ్ము -
భక్తిచే మా కొసంగెడి ప్రణుతి కన్న
భాసురం బగు మత్ప్రియ ప్రణుతి మేలు
మమ్ము నారాధన మొనర్చు మహిమ కన్న
రమణ నెక్కువ వైష్ణవారాధనమ్ము -

ఈ వైనతేయుడే మా
జీవము యీధ్వజము మాకు జీవస్థానం
బై వెలయుట నందుంచుము
శ్రీ వెలయగ గరుడ మూర్తి జెన్నల రారఙ -

సాగర కన్యకా మహియు-క్ష్మాసతి గొల్వగ శేష శయ్య పై-
బాగుగ బవ్వళించి విభవంబున నుండెడు నేను నీ మహో
ద్యోగము నందు బుట్టుట మహత్పరి రక్షకె గాదు - సర్వ లో
కాగములన్ హరించి సదయున్ జను లందరి బ్రోవగా జుమీ -

కాన మత్స్యజంబు గనినట్టి మానవుల్
"కంచిగరుడ సేవ" గాంచి నట్లు -
నిఖిల భోగములను నెగడుచు నావల్ల
కొదువ దీర మమ్ము గొలువరారె ?

అర్చారూపిని మము నొక
నర్చించుటె గాదు మిగుల నర్పించు-నెడన్ -
జర్చించి సర్వ భాగవ
తార్చన పూర్వకము గాగ నర్చించు మనన్-

ఇది కణ్వాశ్రమ మిందు సన్మునులు సర్వేష్ట ప్రదం బంచు నె
మ్మది జన్నంబు లనేకముల్ సలిపి శుంభ ద్వైభవానంద సి
ద్ధి దలిర్పన్ తప మాచరింపుచును మద్దివ్యాకృతిన్ గాంతు రి
ట్టిది భృగ్వర్షి వరేణ్య! యీ స్థలము పాటింపంగ శక్యంబొకో ?

ఇచట గో సమృద్ధి యిష్ట సస్య సమృద్ధి
భూజ వృద్ధి-సర్వ పుణ్య వృద్ధి
జల సమృద్ధి గలిగి జనుల కాయుర్వృద్ధి
కరము నగుచు శుభము గాంచు గాక -

అని పలుకు శ్రీజనార్దన
వనజాయత నేత్రు మృదుల వచన రచన నె
మ్మనమున సంతస మందెను
ముని పుంగవు డంత పూర్వ పుణ్యమ్ము న కున్

అమ్మహనీయ శ్రీ వరు కటాక్ష విశేష సుధా రసంబు చే
నిమ్మహి సర్వ సౌఖ్యముల కిమ్మయి శ్రీ రమణీ నివాసమై
ఘుమ్మని వాసనా ప్రతతి గుప్పెడు తమ్మి కొలంకు లొప్ప శ్రీ
దమ్మయి యెప్డు దొప్పెడు గదా? పరికించితి గాదె నారదా!-

అమిత కలుషాంబుధికి - నగస్త్యా యుతంబు -
వృజన తూలౌఘములకు కృపీట జన్మ -
సత్క్రియా సస్య పంక్తికి సమయ వృష్టి -
కణ్వముని యాశ్రమ మతల్లి-కన్నతల్లి -

కంటివి గావె ! యందరిగి కన్నుల విందు తదాశ్రమంబు న౯
పంటలు ధాన్య రాసులును పాడి పసుల్ ఫల భూరుహంబులున్
గెంటని వాసన ల్మలయు గేదగు లబ్జ సరోవరంబు లి
న్నింటికి సార్థకంబు జగదీశు జనార్దను దివ్య గేహము౯-

ధనదు దెస కణ్వావని-మఖ
వుని దెస శ్రీ తుంగభద్ర-నోలి శమన ది
క్కున వార్నిధి-వరుణుని ది
క్కనగా శ్రీ భావదేవ ఘన సీమ-దగు౯ -

ఈ కణ్వాశ్రమ భూమికి
గైకొన సీమలివి యిందు కమలాపతితో
శ్రీ కరులై మును లెప్పుడు
నాకసుఖం బెవను మెచ్చ రవని మునీంద్రా-

నే నైన ?దేవతా విభు
డైన ? నుమానాధుడైన ? నఖిల సుర గణం
బైన ? ఘన తుంగభద్రా
స్నానము హరి సేవ నెపుడు సల్పెదము సుతా -

ఏ నరు డైన భాను డుదయించక మున్నె తరంగ తుంగ భ
ద్రానది లోన స్నాన జప తర్పణ కృత్యము లెల్ల దీర్చి లో
నూనిన ప్రేమ మాధవుని కూర్జిత భక్తిని మ్రొక్కె నేని ? యా
మానవ లోక పూజ్యుని సమానము నేనును గాను పుత్రకా -

పతితు డైన? నెంత పామరు డైనను ?
చండుడైన ? పాప జాతు డైన
క్షుద్రు డైన ? తుంగభద్రా నది ని గ్రుంక
వాని పుణ్య మెవని వశము దెలుప ?

విప్ర కార్యము నకు విష్ణుపదీ నది
తుంగభద్ర యగుచు మంగళాఖ్య
నంది వచ్చె గాక-నందన ! యా కథ
వినుము శ్రోత్ర యుగళి విందు గాగ -

"స్వర్ణ-పురీ" నివాసుడు ద్విజన్ముడు కేశవభట్టు తాను సౌ
వర్ణ లతాంగి యైన నిజపత్నియు దా ననపత్య తా కథా
కర్ణన మాచరించు నెడ కాశికి బో మతిగల్గి యేగి న
భ్యర్ణ తరంగ గంగను ధరామరు డిట్లు నుతించె భక్తిమై -



తన యుచిత కాలమున కుఁ
దనువు ధరింపంగ గలుగు దార్ఢ్యము గల రాం
తనవుసి గన్నట్టి మహా
త్తను వగు నీ కమల జల సుధాంగా గంగా-

కాంతు డీశుడు -మాత నిన్గనిన తండ్రి
కమల నాభు షు- నను దయ గంటి వేని ?
పార్వతీ పరమేశ్వరుల్ భవ్య పుత్ర
పరమ దౌహిత్ర సంతాన పరులు గారె ?

గోవింద నామధేయుడు
భావింపగ కేశవాఖ్య భగినీ భవుడుఁ
శ్రీ వెలయగ తోడనె నుతి
గావించెను కార్య ఘటిని గం గాతటినిఁ-

ఇటుల మామయు నల్లుం డహీన పుణ్య
భాగి భాగీరథి ని దోగి పరమ నియతి
కాశి వసియించి రొక్క రాకా నిశిని వి
ధూపయూపవసరంబున నుచిత మొప్ప-

"మణికర్ణికా" ఘట్టమున వంతికస్థలి
నివసించు బిందుమాధవుని దివ్య
మందిరంబున కేగి మాటకి బ్రణమిల్లి
శ్రుతి సూక్తు లొప్ప సంస్తుతిలొనర్చి
గోవిందు డనె-కృష్ణ ! గోవింద ! మాధవ !
శంఖ చక్రాబ్జప్రశస్తహస్త !
సర్వేశ ! జాహ్నవి జనక పాదాంభోజ !
కల్యాణ కర ! శుభాకార ! శౌరి !
నాథ ! నారాయణ ! ముకుంద నామధేయ !
కేశ వాచ్యుత దివ్య భోగీశ శయన-
గరుడ వాహన ! శ్రీ రమా కలిత వక్ష !
సాధు సంరక్ష ! ఖల శిక్ష ! సరసి జాక్ష !

మహానుభావా! భావనారాయణుఁడ వను నామాంతరమున బిందుమాధవుం డన ప్రశస్తి నొందిన నిన్నెన్న దరంబు గా దైన విన్నవించెద - నే నాంధ్రదేశీయుండగు విప్ర కుమారుండ నై నందూర నొక పండిత పుత్రకుండ నై వికారాకారంబున బుట్టి దూషిత వేషంబున పోషకులు లేమి నతుల దయాళుండగు మాతుల గృహంబునం బెరుగు చుండ

నొక మహానుభావు ననుగ్రహంబునం భగవ ద్విగ్రహ ధ్యానానూన జ్ఞానం బుపదేశింపం బడిన వాడనై యుష్మత్ సేవనఁబే పావనంబుగా దలఁచు చుంటి నిట్టి కురూపి నగు నాకు వివాహం బగు నటుల మన్మా తులు నకు కుమారికన్ కలుగ జేయు మని విన్న వించి -

మామకు మామవైన దయమాన దృగంచల బిందు మాధవా!
మామక ప్రార్థనల్ చెవికి మాటికి దాల్చిన వేడ్క మీర మా
మామ కపత్య మిచ్చి-కృప మన్నన జేయు వరంబు వేగ ని
మ్మా-మకరాంకు చక్కని కుమారుని గన్న సరోజ లోచనా!

అన విని బిందుమాధవుడు హాస్య రసం బెసగంగ బల్కె ని
ర్ధనికుడు రూపహీనుడును దద్దయు పెండ్లికుమారు-డెన్నడో
జననము నొందగా దలచు చక్కని పెండ్లికుమార్తె గొడ్డురా
ల నుటయు యెవ్వరీ శుభము గాంచగ నోమిన వారలో? భువిన్-

గోవిందా! నీ మామకు
కావలె నని కూతు నొకతె గలిగించినచో ?
నా విప్రుడు నీ కిచ్చునొ
కో ? వేగము తెలిసి వేడుకొనుమా ? వినుమా -
16)

ప్రేమ జెలంగ నిట్లు హరి ప్రీతి నొసంగిన సూక్తి కయ్యెడన్
మామకు బల్కె విప్రుడనుమానము లేకను కూతు నిచ్చు శ్రీ
ధాముడు నీకు మా "కొసగె"దౌ మరి యొక్కరి కివ్వ నేర్తువో ?
స్వామి గృహంగణమ్ము ననె-సత్యము బల్కె మనంగ-నిట్లనెన్-

ఎక్కడి కూతు? రేనెచట? యెక్కడి జన్మము ? యేటి మాట? నీ
కెక్కడ కన్య నిచ్చుటలు ? నెక్కడ బెండిలి ? యిందిరేశు డీ
నిక్కము బల్కు టేడ ? యిది నీకె దగు న్వచియింప ? నైన నా
కొక్క కుమార్తె గల్గిన మహోన్నతి నీకు నొసంగ కుందునే ?

సత్య మంట నీదు స్వామి "విశ్వేశుండు"
"బిందుమాధవుండు"-పేరులేని
వృక్షములును-"జాహ్నవియు"-కాశి-"సాక్షులు"
గాగ నిత్తు నాదు కన్య నీకు -

మామ యిటుల బలుకు మాటకు నల్లుండు
"అవుదె" పెండ్లి యైన యటుల బొంగె -
మరియు కేశవుడు కుమారిని గన్నట్లు
సాధుమతి ని చాల సంతసించె -

ఇట్లిట్టుల కాశీ పురి
మెట్లెక్కుచు దిగుచు పెద్ద మేడల పై బూ
చెట్లం గనుచుఁ మరలిరి
చట్లప్పుడివల వసించి చయ్యన పురికిఁ-

వచ్చి స్వర్ణపురి నివాసుల కెల్లను
వారణాసి నిత్యవాస మహిమ
దెలుపు కేశవాఖ్యు దేవి వేడ్కను దన
గర్భమునను కూతు గనియె నెలమి-

పురుడు గడువ నంత పుణ్యాహ దినమున
శిశువు కెలమి "ధర్మశీల" యంచు
పేరుబెట్ట నధిక ప్రేమ రంజిల్లంగ
నాట బెరుగు దాని పూట బెనిచె-

తలిదండ్రులు ముద మొందగ
కిలకిల నవ్వంగ నేర్చు గెలనను విద్దెల్
సలుపంగ సాగె బిరబిర
కులుకుచు నడ లభ్యసించె కోమలి వేడ్కఁ-

ఇట్లు దినదిన ప్రవర్ధమానయై పెరుగు చున్నంత —
కేశవవర్మ వేష్కు తను కించగ కూతును కౌగలించి యీ
భావభవాస్త్ర సుందరి వివాహ వయః పరిపూర్తి నందె-నీం
డేవిధి భాగినేయునకు నిత్తును ? సత్య మనంబు బూని నే
నీవలె నన్న ? రూపమతి హీనము యేగతి నిత్తు ? పుత్రికన్-

ధనము లేక యున్న ! ధర్మాతు లీవచ్చు
నప్పు గొనగ వచ్చు నడుగ వచ్చు
కలసి వచ్చు నపుడు గడియింప గా వచ్చు
రూప మెవ్వ డిచ్చు ? రూఢి మీర-

"గురు గరిగమ్మ" మేను-మిడిగు జ్లైడపం ల్లను- మిట్టమోము జుం
జురు తలకట్టు-గూని మెత-జూడ నసహ్యపు బొక్కి రొమ్ము.సాం
పర నురఘాళ్ళు కాళ్లు పరిహాస కరంబగు తొంట చేతులున్-
వరుడు వరుం డటన్న ! గన వచ్చిన భామిను లెల్ల నవ్వరే ?

జాలి నివ్వ జాల-పలుకు పప్పగ జాల -
భాగినేయు వదలి బ్రతుక జాల -
యివ్వ నేని ? సాక్ష్య మీశు డీతని బ్రోల
బొంకులాడి దూల బోవ నేల ?

అని యిట్లు సందేహ దోలాయమాన మానసుండగు నవ్విప్రునిం గని భార్య యిట్లనియె -

ఏమీ! మీరలు నెమ్మనమ్మునను భావింపంగ నే యోచనల్!
నా మాటల్ చెవి బెట్టు డింక మన మేనల్లుండు గోవిందు డే
నా! మత్పుత్రికి భర్త? చాలు నిక కన్యా భూషణం బెంత! పై
నేమివ్వంగ దలంచె! పెండిలికి? తానెవ్వారినిఙ గూర్చెనో?

పెండ్లి లగ్న మెపుడు? పేరటాం డ్లెచ్చట!
పెద్దలెందు? వారి బిలువ బంపు
మెవ్వరైన కన్య నీతని కిచ్చిన
మిగులు కార్య - మవల దిగు లదేల?

ఇట్లు పరిహసించి—

నీకేల గల్గె నీమతి
నా కన్యక నివ్వ-నొరులు నవ్వరె? ధన ధా
న్యాకార రహితు డితడే
గాకున్న వరుం డొకండు గల్గడె? చెపుమా -

చక్కదనంబు జూచియొ! సుసంపద జూచియొ! బంధు వృద్ధి పెం
పెక్కుట జూచియో! ధన సమృద్ధిని జూచియొ! ధర్మశీల నా
చక్కెరబొమ్మ నివ్వ మది సమ్మతి నొందితి? విట్టి దోష మే
దిక్కున దీర్చు కోగలవు? దెల్పగదే! దయ ప్రాణనాయకా!

ఏనివ్వ-నివ్వ-నీలత
కానఁ-జనకాన-“గూనిగోవిందున” కుఁ-
మేనల్లుడు పాత్రుండని
దానం బివ్వంగ నెంత ధర్మ మ్మొఁ-

పట్టి నెత్తు నంచు గట్టి తలంపు నీ
కున్న యెడల నెవ్వ రెన్ని యన్న!
కన్నె నీను నీకు గల యధికారంబు
చెల్లనీను పిల్లతల్లి నేను-

ఇయిల బల్కినట్టి యిల్లాలి కనె కేశ
వాక్య భూమిదేవ్ర తతివ నేను
కానీ నిచ్చు “దాన గరిమ” నంటిని కన్నె
నివ్వ - నివ్వ నేమి? హితవె? నాకు-

నాసత్యవాక్య పద్ధతి
కానింతయు చెడదు కన్యకా మణిని దగఁ
భూసుర పుత్రున కొకనికి
జేసెదను వివాహ మిపుడు చిత్త మెలర్పఁ-

దంపతు లిటు లేకమతిఁ
సొంపమరగ నొక్క భూమి సుర సుతునకు నీ
బంపె శుభలేఖ-యది విని
కంపిత గాత్రు డయి మామ గార్కి ననియెఁ-

"గోవింద" భక్తుడను నే
"గోవిందు"డ-నీవు కాశి "గోవిందు"కడఁ
దేవతటినీ తటంబున
భావింపగ కన్య నివ్వ బల్కగ లేదే?

కాశి కాశి యన్న కౌశికు డొనరించు
గాసి కోర్చె సత్య గరిమ భటుని
రీతి దాల్చె శ్రీహరిశ్చంద్రు సత్య ప్ర
కాశి గాక బసుల కాశి యగునె?

మాధవుం డెరుగడా? మానిని తో విశ్వ
నాథుం డెరుంగడా? నవ్య దివ్య
భూజంబు లెరుగవా? బుధ తతు లెరుగరా?
గంగ యెరుంగదా? కలిత పుణ్య

మణికర్ణి కెరుగదా ? మౌను లెరుంగరా ?
వ్యాసుం డెరుంగడా ? భాసురముగ -
మరియు పంచక్రోశమధ్య నివాసులౌ
పండితు లెరుగరా ? దండపాణి

భైరవేశ్వరు డెరుగడా ? బ్రహ్మదేవు
డింద్రు డాదిత్యు డమల రాకేందు డవని
మిన్ను దిశలు నెరుంగవా ? మేనమామ
కూతు నీరాద ! - నీకు నాకును వివాద !

వద్దు వద్దు నీదు ముద్దుపట్టి నొసంగు
మనుచు యల్లు డనగ-నత్త బలికె -
రద్దిజేసి తిపుడు రాకేందు ముఖి నివ్వ
జెప్పికొనుము సభకు జేర జనుము -

ఇట్లత్త బలికిన క్రొత్త మాటలకు చిత్తం బుత్తలపడుచున్న నప్పి
ప్రోత్తముండు తత్తరమ్మున మెత్తని మాటల మామ కిట్లనియె -

సత్యమ్మునకె గదా ! జలజాప్తునకు గాక -
సత్యమ్మునకె గదా ! శశికిరాక -
సత్మమ్మునకె గదా ! జలధు లచ్చటయుంట !
సత్మమ్మునకె గదా ! జనులుమంట

సత్యమ్మునకెగదా ! జలదముల్ గురియుట -
సత్యమ్మునకె గదా ! జగతిమనుట -
సత్యమ్మునకె గదా ! శ్వపనుండువిచుట -
సత్యమునకె నదుల్ జాలుగొనుట -
తలపగా సత్యహీనుడు తగని బరువు
మోయగా జాల ననె గాదె ? భూమి విధికి
గాన సూనృత వాక్యంబు బూను మివుడు
"అత్త మాటలు" మది నూన నర్థ మగునె ?

అనిన మామ యిట్లనియె -
కాశికి పనివినిగొని ర
మ్మా శివ కేశవులు గంగ నచ్చట పంచ
క్రోశస్థిత భూమీరుహ
రాశులు సత్యమ్ము బల్కు రా పొమ్మనిన్-

పటము కటిన్ బిగించి తలపట్టు షటచ్చరమున్ ఘటించి మి
క్కుటమగు తమ్మి పేరు లెద గమ్మననుంచి రమేశు మూర్తి సం
పుట మొక సంచి నుంచి భుజ మూలమునన్ ధరియించి-పాత్ర చే
దిట మొనరించి కాశి కగు దిక్కు మొగం బగుచున్ సదండుడై.

ద్వేషించు టేల మనసున -

రంభ యొక్కెడ నూరు రామణీయత గెల్చు

హేమ వర్ణంబున హీన పరచు -

చంద్ర రేఖలను నొసల్ ద్రాస మొనరించు -

నిల తిలోత్తమ నాస నీసడించు -

హరిణిని తన నేత్ర సరసిజంబుల గెల్చు

మరు గోలలను తావి నురక జేయు -

తార లెక్కెడ కొను గోరుల నెగజిమ్ము

జిలకను వాగ్ధాటి చిన్న పుచ్చు -

హంస యేసాటి! నడలను హాస మాడు-

పట్టి మా మామ పట్టిని గట్టు కొనక -

నెట్టు లోరుతు! విధివ్రాత యెట్టులయ్యో !

పట్టి నా కివ్వగా జేయు ప్రభులు లేరె ?

తిన్నన పాదముల్ గడిగి దంపతు లిద్దరు మేలు శాల్వ వుం
బట్టున నేయు ధోవతులు భాతిగనీ మధుపర్క మిచ్చి చే
పట్టు మటంచు పుత్రిక శుభస్థితి నాకు నొసంగు రీతి క
నట్టిన యట్టు దోచె శుభ కార్యము నేడు ఘటింప కుండునే ?

ఇత్తురేమొ ? కన్య నీశ్వ రార్పణముగ
వచ్చునేమొ ? హరి వివాహమునకు
పండ దనుచు నరులు పరిహసించిన చేను
పండునేమొ ? యెవరి వశము దెలియ ?

కాశి కేగు నాకు కల్యాణ మెక్కడి
దనగ రాదు విప్రజనుల కెల్ల
కాశి కేగకున్న కల్యాణ మున్నదా ?
దక్కు వేమి ? బుగ్గచుక్క దక్క-

అని చింతించుచు నేగు మార్గమున దేహగ్లాని చే నిద్ర సో
కున్న బ్రాల్మాలి వటంబు పొంత దగ కన్గూర్కన్ దయాశాలి శ్రీ
వనితారత్నముతో రమాధవుడు తేవన్ వచ్చి-గోవింద ! లె
మ్మన షూ ! కాశికి నేగు దెంచు మని శ్రీహ స్తంబు చేపట్టుచున్-

కొనిచని యిదె గంగానది
గనుగొను మని చెప్పి తాను కాంతయు నరిగెన్-
దినకరు నుదయము నందున
గనియెన్ - కల్యాణరాశి కాశి న షూ సిన్ -

"మణికర్ణిక"ను గ్రుంకు మనుజులా గంగకు
భక్తితో నేగెడి భామినులును -
తీరంబుననుసంధ్య దీర్చెడి విప్రులు -
తరి పితృతర్పణ తత్పరులును -
ఘట్టమ్ము నను నర్ధకాంక్ష గ్రిమ్మరు ద్విజుల్ -
బుధుల సేవించెడి పుణ్యవతులు -
వేదవాదులు తర్కవాది జనంబులు
యతులు యోగాభ్యాస యుతులు నతులు
సౌధములు వీధులును ధర్మశాల దేవ
తాలయంబులు చూచె ప్రహర్ష మెసగ -
నవనిసురు డాత్మ నాశ్చర్య మతిశయింప
పూర్వమున గన్న కాశికా పుర మటంచు -

కంటిని కంటి కంటి మును గన్న రమాధిపు నిండు వేడ్క నా
కంటికి నింపుగా శ్రుతులు కన్గొన జాలని తమ్మికంటి ము
క్కంటియు తమ్మిచూలి తెరగంటి దొర ల్మదినంటి భక్తి చే
కంటకు లన్సహా సురుల గర్వ మడంచు కడింది వేలుపున్ -

బోధ జెలంగ వేవెదను బో. నిను చక్కని విశ్వనాథు నం
భోధర వర్ణ పార్వతికి బుట్టిన తుండిని దండనాథు గం
గా ధుని తీర భూస్థలిని గల్గిన వెల్లను "సాక్ష్య" మీయుగా
మాధవు తోడరారె ? గరిమ న్నను బ్రోవరె ? మీకు మ్రొక్కెదన్-

పిల్ల నీ మటంచు నిల్లాలు మామయు
ప్రల్లదమ్ములాడి వెళ్ళ మనిరి -
తండ్రులార ! కన్నతల్లు లారా ! పుత్ర
వంతు లార ! పుణ్య వంతులార ?

అని యిట్లు చేతనాచేతన విభాగంబు మాని మిగుల జాలి దీపునిం బోలి
ప్రార్థించు ధరణీసురుం గని శ్రీవరుం డిట్లనియె —

వచ్చెద నేను జాహ్నవి శివా ధవ భూరుహపంక్తి తోడుతన్
సచ్చరితుండ నీవు జను చక్కని మార్గము పట్టి యేగుచో
నెచ్చట "మోము ద్రిప్పి కను దింపు దలిర్పగ నందె యుంచు" మే
మిచ్చగ మాడబొమ్మనిన నేగెను విప్రుడు సంతసించుచున్

మోమెత్తక నటు నిటు గన
కామోద రసాంతరంగుడై వచ్చెడి త
ద్భూమీసుర వరు తోడ న
భో మార్గగు లగుచు నగుచు పుత్తెంచు నెదన్-

ఆ వనజేక్షణుండు మది హర్ష మెసంగగ గాంచె నంత గో
ష్ఠీవన రాజము న్మలయ శీతల పోత సమీర చంచల
త్పావన రాజముఙ్-నిగమ వాద వినోద నినాద మోద కృ
ద్దేవ సమూహముఙ్ - శుభ నదీ నవ గంధ మిళ త్సరోజముఙ్-

వనము లందు బృందారక ముని బృందంబులతోడ శతానందుండ నగు
నే నుగ్రతపం బొనర్చి సౌవర్ణారవింద కర్ణికా పీఠ మధ్యంబున యింది
రేశు పాదార వింద౦బు లర్చించి యున్న పుణ్యయంబుల ప్రోవగు నప్పా
వనాశ్రమంబున విశ్రమించఙ దలంచిన వాడై

మది లోన లేని సందియ
ముదయింపగ జేసె-భూసురోత్తమునకు యిం
పొదవ సుదర్శన ధరుడిటు-
గదియంగా రాడదేమొ ? కనుగొనెదనుచుఙ్-

మోము ద్రిప్పి జూడ శ్రీ మనోహరు తోడ
నందరందు నిలువ డెంద మందు
గుందు గదుర "గూనిగోవిందు"డయ్యేడ
నిందిరేశు తోడ నిట్టు లనియె—

వచ్చితి కాశికా పుర నివాసము మాని రమేశ వేడ్క మీ
రిచ్చటి కేగుదెంచుట మహీసుర కార్యము నిర్వహించ కన్-
బొచ్చెము లేక గోష్ఠివన భూమి వసించితి ! నిన్ను మాని నే
నెచ్చటి కేగువాడ నన ! నింపు దలిర్పగ శౌరి యిట్లనెన్-

నీవు సమయమునకు నిలువక కనుద్రిప్పి
చూచినాడ వేమొ ? స్రుక్కి యిచట -
నిల్చినార మయ్య నింద్య మేమియు లేదు -
యిందు నిల్చి "సాక్ష్య" మిత్తు మేము -

పామ్మా వేగమె స్వర్గ కియ్యెడల నింపు న్మీర వేవేగ దో
డ్తెమ్మా మామను పత్ని తోడుతన్ను ప్రీతిన్ మీకు నై మెచ్చి "సా
క్ష్య" మ్మే మిచ్చుచు జేతు మింపరము కల్యాణమ్ము నీ కిష్టవే
రమ్మా జాప్యము మాని రేపటి ముహూర్త మ్మేల ! తప్పింపగన్!

మామకాగమ వార్త మీ మామ మనెకి
తెలియ బలికితి వేని ! మా దెసను ప్రీతి
కలిగి రాగల డతడు సకామినీ సు
తా సమేతంబుగా పరతంత్రు డగుచు -

"వల్లే" యని గోవిందుడు
పల్లెలు పట్టణము లెల్ల బరికించుచు రం
జిల్ల హుటాహుటి నడిచెఁ
కల్లరి స్వర్ణ గని మామగారిని గాంచెఁ -

తోడి తెచ్చితి నిదిగొ నీ తోడు బిందు
మాధవు నుమాధవు ననామమహీజపం క్తి -
జాహ్నవియు వీను "సాక్షులై" సత్యమునకు
వచ్చి నిను బిల్వ మనగ నే వచ్చినాడ -

ధర్మపత్ని నీవు తనయను గూడుక
రమ్ము శుభముహూర్త మిమ్ము శౌరి
కరుణ గాంచుటయును కన్యాప్రదాన భా
గ్యంబు నొక్కసారి గలుగు నీకు

అనిన విని మామ యిట్లనియె -

ఎక్కడి కాశి ? యెప్పుడట కేగితి ? వట్టి సుతా మనోహరుఁ
డక్కన వేల్పులఁ పరమ ధార్మిక ! యెట్టుల దోడితెచ్చి ? తీ
వెక్కడ ? వార లెక్కడ ? గణింపగ నంతర మెంచి చూడ గా
చక్కని దోమ కేనుగకు సాటిని బోల్పగ వచ్చు-నిద్దరఁ-

అహహ ! నా పుణ్య మరయ నే మనగ వచ్చు
కాశి లో నున్న వారలే కదలి రాగ
స్వర్గ లో నున్న నేను రాజాల ననుట
మేలు సమకూరునా ? యది చాల తప్పు -

అని యివ్విధమ్మున కేశవభూసురుం డాత్మపత్నీ సమేతమ్ముగా నక్క- న్యకా మణిఁ దోడ్కొని వేడ్క- లుప్పొంగ మంగళాశీషంబులు జెలంగ మంగల శుభ నిమిత్తంబులంగనుచు సంతోషితాంతరంగుడై భాగినేయు తోడ నీడయుం బోలె చని చని -

కేశవ ద్విజుండు గాంచె కేశవేశునిఁ-గుడా
కేశ మిత్రు జైత్రు వ్యోమకేశ సన్నుతుఁ-హృషీ
కేశు సంతత ప్రకాశు ఖేచరాబ్జ గర్భ మౌ
నీశ వందితుఁ పరుఁ పరేశు-స్వప్రకాశునిఁ

నీలాంబుద చ్ఛాయ నెగడు నెమ్మెయి వాని -
కరుణా రసం బొల్కు కనుల వాని -
మరుసింగిణుల బొల్పమరు కన్బొమల వాని -
తొగరేని సరి నగు మొగము వాని -

కోమలాంజన పుంజ కుంతలమ్ముల వాని -
హేమాంబట్టు కట్టుపుట్టంబు వాని -
కమనీయ మణి హార కలిత వక్షము వాని -
రమణీయ సన్మణీ కుండలముల వాని -
కలిత ఛిద్రోర్ధ్వ పుండ్రాలికమ్ము వాని -
విమల శ్రీ శంఖ చక్ర హస్తముల వాని -
తమ్మి పూ ఇంటి గరిత గేల్దమ్మి వట్టు
కొన్న వానిని-ధాతను గన్నవాని -

కెలన విశ్వేశ్వరుండు భాగీరథియును
పేరులేనట్టి వృక్షముల్ పెద్ద వెలగ
కెలమి చన్నావరింప సురేంద్ర ముఖ్యు
లుచిత గతి గొల్వ గొలువయి యున్నవాని -

ఇట్లు గాంచి -

ఒకనమస్కారమ్ము సకల లోకాధీశ !
రెండు మ్రొక్కులు నీ కఖండతేజ !
మూడంజలులు సర్వ ముని లోక వందిత !
నాల్గు సాష్టాంగముల్ నళిన నాభ !

ఐదు జోహారులో అంబుజ దళ నేత్ర!
పది శరణములు దివ్య ప్రభావ!
నూరు జేజేలు శ్రీ ధారాధర శ్యామ!
వేయు నుతు లొనర్తు శ్రీయుతాంగ!
లక్ష కొలది ప్రణామముల్ పక్షివాహ!
యమిత దాస్యంబు లిడుదు శేషాహి శయన!
ధన్యతను జెందితిని మీరు దయను నన్ను
జేరి రక్షించ నిందు వేంచేయు కతన -

మును కాశికి పనివిని నిను
గనుగొంటిని మరల నిచట గంటి నహహా! యీ
జననమున నే కృతార్థత
గనితిఁ; మనితిఁ: త్వదంఘ్రి కమలాభి రతిఁ -

ఆడజను తీర్థ మెదురైన యటుల మీరె
వచ్చితిరి మాకు దర్శన మిచ్చుటకును
బొంకులాడి యు నేను సత్పుణ్య శీలు
లెవ్వరును గాంచ లేని మిమ్మిపుడు గంటి -

ఎందుకు గల్గె ? నింత దయ యే తపమో గనరాదు "గూనిగో
విందుని" భాగ్య సంపదను వేల్పుల కైన గనంగ శక్యమా !
మందుడ దుష్టబుద్ధి నతి మత్తుడ-పాపిని-దుర్మదాంధుడన్-
ముందర సత్యమాడి-నిటు బొంకితి నల్లుని మీద గంకితిన్ -

ఎరుగ నింత భక్తు డీ "గూని గోవిందు"
డనుచు మిమ్ము దెచ్చు ననుచు మదిని
తప్పు జేసినాడ దైవతారాధ్య ! నీ
యడుగు లాన బొంకులాడ నికను -

నా తనువును నా ధనమును
నా తనుజాతయును సతియు నాదు గృహంబున్
నా తొడవులు నా సురభులు
సైతము మీ సొమ్ము నెటుల సాకెదొ ! దయతో -

అని పలుకు కేశవ ద్విజ శిఖామణికి దైవత శిఖామణి యిట్లనియె -
గంగను మున్గి సాధు మహి కర్పికకున్ బ్రహ్మమిల్లి-వాదు బ్రో
లం గరకంత డంబిక ల లక్ష్య మతిన్ వినుచుండ-భాగినే
యుం గని గూతు నిచ్చెద మహోన్నతి నీకు-తదీయ పత్నిక
న్యం గనె నేని తప్పనని కాశిని పల్కిన పల్కు వ్యర్థమే ?

దేవతలు వేప విద్యా
దేవాంగమ నందు ముదము దేలుచు నుంద్రే
నే వేళ నతిసి కే నతి
గావింతును సత్యవాక్య గౌరవ మొసగన్ -

ఎప్పటికి సత్యవాక్యము
దప్పంగా రాదు నొకట దప్పిన చో మీ
"అప్ప"కొడు కైన గోవిం
దప్ప విషయ మందునా ? మదాప్తుడు గాడే ?

భూసురుడె సత్య సంగతి
కోసరిలిన చోట వీతిహోత్రుడు హిమమై
భాసిలడె ? చంద్ర సూర్యులు
వాసి జెడక రాసులందు వర్తింతు రొకో ?

ఇమ్మీ కన్యను - సత్యము
సుమ్మీ ! నీ వనిన మాట సొగసేటికి నీ
వి క్షీననేత్రి నొసగుము
పొమ్మీ గోవిందుడే విభుం డనుకొమ్మీ -

అప్పా ! నన్నీ గోవిం
దప్ప కొసగి పెండ్లిసేయు మని నీ సుత చే
నొప్పించెవ గనుమా మా
గొప్ప తనము వాని యందు కూరిమి ననగన్ -

కన్నులు వెడదలై గనుపట్టె మోమంత
పున్నమ రేనితో పొలుపు మీరె -
కంధరం బుదరంబు కన్న చక్కన గాంచె
కరి కరంబుల మించె కరయుగంబు -
వక్ష మంతంతకు వైశాల్యత వహించె
నుదరంబు సౌందర్య మూదు కొనియె -
అనటి గంబమ్ము లా ! యన దగె నూరువుల్ -
ఘన కాహళములై జంఘా యుగళము
పాదములు పంకజాత సు శ్రీ ద గరిమ
నొప్పె నప్పుడు వేల్పు శ్రీ లుప్పతిల్ల
తప్పక రమాధవుని కృప గప్పు కతన
నప్పు డటు గన "నొప్పులకుప్ప" యయ్యె -

ఇట్లు భగవత్కృపా విశేషంబున గోవింద నామ విప్రవరుం డప్రతిమాన సౌందర్యంబున ప్రవరుం దిరస్కరించుచు సుందర పుండరీకాక్షుండా క్షేత్రాధ్యక్షుండగు సత్యవతీశున కీభూసుర వివాహ మంగళం బీ నగరంబున గావింపు మని యాజ్ఞాపించిన యాతం డతి కుతూహలాంతరంగుండగుచు నొక దివ్యాగారం బతి మనోహరంబుగా గావించి సుధాలేపనాది కృత్యంబు లొనరింప నాజ్ఞాపించి విమల పట్టాంబరా వితాన శోభితంబును చూత పల్లవ దామ విభ్రాజితంబును కదళీ స్తంభ పూర్ణ కుంభాది మంగళ శృంగార విలసితంబును సకల జన మనోహర ధూప వాసనా వాసితంబును హరిద్ర తండుల తాంబూల మలయజ మిశ్రిత కర్పూర మృగమద సంకుమదాది సుగంధ వస్తు ప్రస్తుతంబును నారికేళ చూత ఖర్జూరాది ఫల భరితం బగునటు లొనరించి కేశవద్విజుని రావించి సమర్పించిన -

రఘుపతి రమణులు మీరలు
నుముహూర్త మ్మిదియె మీదు సుత నిందు ద్విజో
త్తము డీ గోవిందున కన
విమలాంతఃకరణు లగుచు విని వారలొగిన్ -

కుమారుతు నల్లుసకుసు కొమరొప్ప మంగళ
స్నానముల్ గావించి సకలదివ్య
భూషణ శ్రీగంధ భూషితాంగుల జేసి -
కనకాంబరమ్ములు గట్టనిచ్చి -

కాటుక రేఖలు కనుదమ్ములను దీర్చి
పునుగు కర్పూరముల్ బొట్టులుంచి
కంకణంబులు చేత గదియించి మరి మంచి
ముత్తియమ్ముల హారముల నొసంగి -
వేడుక లొసంగగ వివాహ వేది నుంచి
మొనసి పౌరోహితుల్ మంత్రముల్ పఠింప
లలన లిరుగడలను ధవళములు బాడ
వాద్య ఘోషమ్ము లెసగ నివాళు లొసగ -

వేశ్య లాడ గ్రేవ వింజామరలు వీవ
కేశవద్విజుండు శ్రీశు నాజ్ఞ
కూతు నిచ్చె నంత గోవింద శర్మకు
సకల భువన ములును సన్నుతింప -

తలబ్రాల్ పోయించిరి శ్రీ
తల దృష్టుల నొకరి నొకరు దంపతులు ముదం
బలర గనుంగొని సిగ్గులు
దల యొంచగ మరుడు గోర్కె దలనెత్తంగన్ -



పాణిగ్రహణ సప్తపది లాజహోమంబు
మొదలు స్థాలీపాక ముఖ్య విధియు
వైశ్వదేవంబు నవల బలి దానంబు
మూడవ నాడు నింపుగ సదస్య
మహదాశిషంబు శ్రీమహిత సంభావన
లూర విందులు ను శ్రీ మీర శేష
హవనంబు దంపతీ శివకర దీక్షా వి
వర్జనంబును నాకబలియు నాది
గా గలగు నట్టి వైవాహ కార్య సమితి
గడిపి దంపతులను రమాకాంతు సన్ని
ధికిని దోడుక జని దేవ దేవు మ్రోల
నిలిపి కేశవశర్మ దా బలికె నిటుల -

దేవా! దేవర యాజ్ఞ చే భటుడు దోతెంచెన్ సతీ యుక్తుడై-
వైవాహక్రియ దీర్చి నీ కృపకు నెవ్వం డిట్లు పాత్రుండు! శ్రీ
గోవింద ద్విజు రీతి-దంపతుల మ్రొక్కుల్ స్వామి! గైకోగదే!
కావం బ్రోవగ నెవ్వరింక! హరి! నీకంటెన్ దయా సంభృతుల్
19)

అవనత శిరస్కుడై శ్రీ
ధవున కిటుల విన్నవించు తరి-నల్లుడు స
త్ప్రవిమల తర వాచా వై
భవ మెసగగ భావదేవు ప్రస్తుతి సేసెన్ -

సర్వ భూతములకు సాకి వౌటయె గాదు
ప్రత్యక్ష సాక్షివై బరగి తిచట -
మరి బిల్వ వత్తు వన్మాట మాత్రమె గాదు
వచ్చితి కాశికా వసతి మాని -
అతి కృప గల్గి మాటాడు టంటయె గాదు
పల్కితి సుధ లూర భటుని తోడ -
వత్స వెంటను గోవు పలె వత్తనుటగాదు
వేంచేసి నాడ వీ వెన్ను దగిలి -
యేమి జెప్పుదు ? నెనరుల గీము డెంద
మిందిరాధీశ ! వీని నీ మందిరాంగ
ణంపు పరిచారకునిగ భావింపు మెలమి
పరమ కరుణా స్వభావ! శ్రీభావదేవ !



రూఢి గనిన కురూపి సురూపి జేయ
నర్థిని యతీంద్రు బట్టి గృహస్థు జేయ
లీల గసగ- కుచేలు సుచేలు జేయ
నీకె దగుగాక యొరుల కీ నేర్పు దగునె ?

అని పలికిన గోవిందున
కనియెఁ గోవిందు డాయెనా ? బెండిలి ? నీ
కనుకూల వతియె గద సతి
తనయా ! వర్థిల్లు డాది దంపతు లట్టుల్ -

మీ రిద్ద రైహిక సుఖం
బారయగా ననుభవించు డంతట దేహ
ప్రారబ్ధాంతమ్మున మము
జేరుడు మత్సన్నిధిని వసించుచు నుంతఁ -

పల్కె నపుడు కాశిపతి విశ్వనాధు భా
వించి గారవించి హితము నీకు
ధనదు డెపుడు మమ్ము దగ్గరి తద్దెస
నుండు మనియె నంత నుచిత భంగి -

"కనకానామక తరువుల"
గని గోష్ఠివని వసించగా బలుకుచు మ
త్తనయా భాగీరథి ! నీ
వనవర తార్క్ష్యాది విధుల కనుగుణ మగుచున్ -

తుంగభద్రా నది యె నీకు తోడు గాగ
మత్పదాంభోజముల పొంత మానకను ప్ర
వాహగతి కణ్వనాశ్రమ ప్రాంత భూమి
నొరయుచును జేరు మీవు ప్రాగుదధి కనియె.

మరియును
ఆరయుగా "కపోతగిరి"యం దుదయించి త్రికూట పర్వత
ద్వారము నుండి వచ్చి శుభదాయిని యై పరమార్థ మొప్ప "నోం
కారనదీ లలామ"యను ఖ్యాతి వహించి జగద్ధితంబుగా -
జేరెను తుంగభద్ర శ్రుతి సేవిత కణ్వ మహాశ్రమస్థలిన్ -

పరమర్షి ! తుంగభద్రా
ఝరి మహిమము దెలియ దెలుప జాలునె ! భుజగే
శ్వరుడును- నకును దెలుపగ
దరమే ? యణుమాత్ర మేమొ ! దగ బలికతి నే -

కావేరి తుంగభద్రయు
దేవనదియు కృష్ణవేణి దెలిసి కొనగ గో
దావరియు పంచగంగలు
గావే! యొక్కొకటి మోక్ష కరములు సుమ్మీ -

శ్రీ మహిత మైన తుంగభద్రా మహత్వ
మడిగితివి గాన తోచిన యంత మాత్ర
తెలిపితిని నీకు యికనేమి దెలుప వలయు ?
నడుగవే? యన నారదు డజుని జూచి -

ఈ "కణ్వాశ్రమ" మెప్పుడు
"శ్రీకర్ణపురంబు"నాగ జెలగెను తండ్రీ!
నా కానతీవె నీవు-మ
హా కృప వాణీ సతీ సమన్విత! ధాతా!

పుత్ర! వినుము దీని పూర్వోత్తర సమృద్ధి
జెప్ప మనుచు ప్రశ్న జేసి తిపుడు -
నరయ మంచిదే జనార్దను డుండుట
బొలుచు శ్రీ వికుంఠ పురము గాగ -

అది కృతయుగంబు నందు "కణ్వాశ్రమం"
బవల "కణ్వపుర" మహాఖ్య త్రేత-
ప్రబల "శ్రీకదులపురము" ద్వాపరమ్మున-
కర్లపుర"మనంగ కలిని బరగె -

సిరి మీరగను జనార్దన
హరి వసియించుటను "శ్రీజనార్దన పురమ౯"
గురుతు గలిగె-"నెలకుదుర"ని
సరసులు గొంద రన నింపెసగె నీ పురమే -

"కణ్వానాశ్రమం"బు"కర్లపురం"బౌట
తుంగభద్ర దివ్య గంగ యౌట
దెలిపి నాడ నింక దేవదేవుని కథ
దెలియ చెప్పు మన్నచు బలుకుటయును -

ప్రణవ నదియు తుంగభద్రా నదీ సంగ
మమున ఘోర పాతకము లొనర్చు
మనుజు డైన స్నాన మొనరించె నేని ? యా
ఘనుడు స్వర్గగామి గాక యున్నె ?

శుచి మార్గవ్మధు మార్గశీర్షము లనఁ సొంపొందు మాసమ్ములఁ
శుచి పక్షమ్ముల విష్ణు వాసరములఁ శుద్ధాత్ములై కామినీ
ప్రచయంబుల్ పురుషుల్ సభక్తిని గణింపఁ తుంగభద్రా నదీ
ప్రచుర స్నాన మొనర్చి- శౌరి గను వారల్ ధన్యులౌ పుత్రకా!

దేవుని యాజ్ఞ నీ వరకు దేకువ శ్రావణి నబ్ధి పొంత గో
దావరి జేరి దివ్య నది దద్దయు కృష్ణను జొచ్చి తుంగభ
ద్రా విలసత్ప్రవాహ గతి హర్ష మెసంగగ కణ్వ నాశ్రమ
ప్లావన మాచరింపుచు శుభస్థితి జెందు సుధీ పయోనిధీ!

కణ్వముని యాశ్రమమ్మున కాపురమ్ము -
శ్రీజనార్దన దేవు సంసేవనమ్ము -
తుంగభద్రానదీ స్నాన భంగిమమ్ము -
దొరకొనవు మూడు త్రైలోక్య దుర్లభములు -

అని

వాణీ నాథుడు బల్కె నారదున కెవ్వండేని! గోవింద క
ల్యాణ మ్మార్తి పఠించినఁ- వినిన-వ్రాయఁ-ప్రీతిచే సర్వ గీ
ర్వాణుల్ మెచ్చగ-నిష్ఠిపూర్ణుడన పుత్ర ప్రాప్తి బ్రాపించి ని
ర్వాణానంద సుఖైక భోగి యగుచుఁ రంజిల్లు నిర్వాగతిఁ -

శీతల కటాక్ష పరిషిక్త భువనాంతర విశిష్ట జనతా వినుతి పాత్రా
వాతదశనాది మునివందిత పదాంబురుహ వాసవఫణీంద్ర రుచిగాత్రా
పీత వసనాకృత విభూషణ వర స్తవన ప్రీతికర సాధు వస చైత్రా
రాతినిఘనాతి కృపరంజిలగ బ్రోచిన సిరంగనగరాంబుజని మిత్రా-

శ్రీరంగనాయకీ కుచ
సారస ముకుళ ప్రలిప్త చందన ఘన కా
శ్మీర సుమిత్రా కలితో
దార విపుల మహిత వక్ష! దళితవిపక్షా!

ప్రాలన్ "శ్రభలు" తప్పులు -
చాలంగా గలవు శబ్ద సంగతు లెసఁగన్ -
గేలిం బెట్టక -తిట్టక -
జాలిన్ బడి దిద్దు డఖిల సజ్జనులారా!

ఇది శ్రీభగవద్రామానుజ కరుణా కటాక్ష కలిత కవితా విచిత్ర
సుకవి జన మిత్ర వైఖానస సూత్ర పవిత్ర భారద్వాజస గోత్ర
వేంకమాంబా జనార్దనాచార్య పుత్ర నిఖిల భాగవత విధేయ
లక్ష్మణ నామధేయ ప్రణీతంబైన జనార్దనాభ్యుదయం
బను మహాప్రబంధము నందు సర్వంబును
సంపూర్ణము.

# (చూర్ణిక)

శ్రీమదఖిల నిగమాంత సార మను నిశాకాంతాది మధ్యమాంతిమ ప్రతిపాదిత శేషత్వ పారతంత్ర్య కైంకర్య ప్రతి సంబంధి శేషిత్వ శరణ్యత్వ ప్రాప్యత్వా దీశ్వ రాకార త్రయానుగుణ శాంత శమ దమా ద్యనంతకల్యాణ గుణ మణి గణాలంకార లక్షణ లక్షిత విలక్షణాత్మక విశిష్టభగవత్స్వరూప కృతావతార లీలం, సాధు జన విరచి తోపచార జాలం, సకల జనానుకూల మపి కేవల ప్రపన్న జనార్తి లోలం, అంబర మణి బింబ లంబోదరాంబికా దిగంబరాద్యనీశ్వర సామ్య జ్ఞాంబూనదాంబర శాంబరీ వాదవాది నికురుంబ తాథాగత బోధా నిదాఘ బాధా పరిమ్లాన చేతన కలమాజ్ఞానాన్యథాజ్ఞాన విపరీత జ్ఞానానూన తాపోపశమన రమా కమన కథా సుధారస పరివాహ వాక్ప్రవాహ దాయకం, పరితుషిత యతికుల నాయకం, శ్రీధర సాక్షాత్కార జ్ఞానానంద పరవశ పరాంకుశాది దివ్యసూరి సుధా ద్రావి ద్రావిడ వేద గాథార్థోపదేశ దేశ దేశాదాగత మహాభాగవత మతానుగుణ చర్య రమా హార్య నాథార్యానుకంపా సంపాదిత భగద్విషయాది దివ్య ప్రబంధ శబ్ద రసార్థ రసభావ రసాను స్మరణ క్షణ క్షణ రోమాంచ కంచుకిత పంచాయుధావస్థ పంచకార్య త్రితయోదంచన్మ స్తకానన హస్త యుగ హృద యోరుస్థల జంఘా చరణాంభోజ కరణరాజ రాజ ద్దివ్య విగ్రహం, నిఖిలో జ్జీవ నానుగ్రహం, వినిహత స్వదాసాపగ్రహం, పంచజన పంచానన తా సూచన కాంచన పంచానన ముఖో దంచన్మణి వలయ కలిత కర యుగ కిసలయం నిఖిల సద్గుణ నిలయం, నిజ కటాక్షశీతల జిత మలయం, శ్రీవైష్ణవ రమాలవాల విశాల భుజాంతరం, పరిశ్రవత్కాంతి ప్రవాహ రంగ త్తరంగాయ మానావళి సుందర నాభికావర్తా వటోత్థ డిండీర మండల పాండుర పటీకటీర భాసురం వినిర్జిత మానవా సురం, దిగ్దంతి శుండా దండ సువర్ణ కదళికా కాండ జితోరుకా కాండం, జంఘా తిరస్కృత శాలికా గర్భతండం, భక్తావన పరా

యణ శ్రీమన్నారాయణ స్వాపహరణ స్తేయాదాయాత మాయా మోహాంధ కార సంసారాకార కారాగార దారాపత్య బంధ బంధీకృత ప్రాకృత జనతా ఘనతా పాపయూపాపన్నివారణ కరణ తరుణారుణ కిరణ ప్రసారణ విలస త్కాంజాత కాంతి పుంజ పింజరాయమాన శరణాగత వజ్రపంజరాయమాన మానాస్మదు త్తమాంగ సంగతాభరణాయమాన చరణ సరోజ యుగ విరాజ మానం, మధ్యమ పదార్థ జ్ఞానీకృతాభిమానం, సంతతార్య మతాను సరణ వేంకట రమణార్యమాదిపరమైకాంత భాగవ తాంతరంగ సేవా సమయ పరిగీయ మాన శ్రీనామ గీతికా పరిశ్రమణ కందళికా శ్రితామర తరు కృష్ణ గురు చరణ సరసిజ ద్వంద్వం- విహ్యాత కామాది ద్వంద్వం, సేవిత జగదాది ద్వంద్వం నరహరి మంగళాశాసన పరతా సదారామ కైంకర్యా చరితా హరే ర్జంగమ విమా నాతపత్రా స్థానతా పూర్ణోప దేశాభిమానతా శఠ కోప గురు చరణ ధ్యానతా రాఘవ చరితాను వర్ణనా హీనతా రామా నుజ త్వాద్వేతి విద్భి ర్మహద్భి ర్వితర్కిత మను మానసిద్ధాభిధానం ప్రపన్న పరాధీనం-పరమ కృపావంతం ఆశ్రిత వసంతం సంతం తం త్వాం ధ్యాతు మసమర్థ స్తోతు మప్యనవరత దురింద్రియాధీన తయా నిర్గత భియా హీన క్రియా దూనయం క్వాం మామవాబ నిర్హేతుక కృపయా పునః పునాఘమేవ కరోమి నిరపత్రపయా సకల మలీమసే నాత్మనాచాలం కురుమే తవదాస దాస చరమావధి దాస దాస్యాను కూలం నమోనమః-

అకృత్య కరణ కృత్యా కరణ భగవదపచార భాగవతాపచార సహ్యాపచార అసహ్యాపచార రూప నానావిధా నం తాపచారాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాన్ సర్వాన్యశేషతః క్షమస్వ దేశిక సార్వభౌమ దివ్య యశో జిత హిమధామ ఆచార్యచంద్ర పరమ కృపాగుణ సాంద్ర ఆశ్రిత సౌరతరో శ్రీమద్రామానుజ గురో సంతత శ్రీరస్తు తే మామవతే భవతే సమస్త సన్మంగళాని భవంతు— శ్రీ ర స్తు

# ఈ కృతికి అక్షరాకృతి నొసంగిన సుకృతులు

| | | |
|---|---|---|
| శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానం | అల్లూరు | 300/- |
| శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవస్థానం | మునుకుదురు | 200/- |
| శ్రీ చెన్నకేశవస్వామివారి దేవస్థానం | చందోలు | 200/- |
| శ్రీ పోలేరమ్మవారి దేవస్థానం | కొండపాటూరు | 200/- |
| శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామివారి దేవస్థానం | పొన్నూరు | 300/- |
| శ్రీ అమరేశ్వరస్వామివారి దేవస్థానం | ఉప్పుటూరు | 200/- |
| శ్రీ వేణుగోపాలస్వామివారి దేవస్థానం | పరుచూరు | 200/- |
| శ్రీ భీమేశ్వరస్వామివారి దేవస్థానం | పరుచూరు | 200/- |
| శ్రీ బ్రహ్మేశ్వరస్వామివారి దేవస్థానం | పచ్చలతాడిపర్రు | 200/- |
| శ్రీ వేణుగోపాలస్వామివారి దేవస్థానం | పచ్చలతాడిపర్రు | 200/- |
| శ్రీ వేణుగోపాల ఆంజనేయస్వామివార్ల దేవస్థానం | కసుకుర్రు | 200/- |
| శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామివారి దేవస్థానం | అప్పికట్ల | 300/- |
| శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానం | అప్పికట్ల | 300/- |
| శ్రీ భ్రమరాంబా వీరభద్ర సమేతమూలస్థానేశ్వర స్వామివారి దేవస్థానం | ఇంటూరు | 200/- |
| శ్రీ వేణుగోపాలస్వామివారి దేవస్థానం | మోపర్రు | 200/- |
| శ్రీ చౌడేశ్వరస్వామివారి దేవస్థానం | మోపర్రు | 200/- |
| శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవస్థానం | కావూరు | 200/- |
| శ్రీ రామేశ్వరస్వామివారి దేవస్థానం | ఐలవరం | 200/- |
| శ్రీ వేణుగోపాలస్వామివారి దేవస్థానం | ఐలవరం | 200/- |
| శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామివారి దేవస్థానం | గణపవరం | 200/- |

# అచ్చు తప్పులు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 11 | స్తోమా | స్త్రోమా |
| 10 | 12 | ద్యుత | చ్యుత |
| 32 | 6 | శ్రీవరు | శ్రీవరు |
| 47 | 3 | కుందన | కుంధన |
| 50 | 20 | భర్తా | భర్త్రా |
| 61 | 19 | నం శరణం | నశ్శరణం |
| 63 | 13 | రాంచిత | రాంచిత |
| 70 | 10 | ప్రాహి | ప్రాపి |
| 70 | 18 | శద్దా | శబ్దా |
| 70 | 18 | తం | కం |
| 90 | 16 | భృధై ర్య | భృద్ధైర్య |
| 91 | 2 | దాల్భ్యే | దాల్భ్యే |
| 94 | 14 | పద్మాది | పద్మాధి |
| 112 | 15 | దేశయుం | దేశీయుం |
| 116 | 10 | గుడ్లదపండు | గుడ్లెదపండ్లు |
| 116 | 2 | వర్మ | భట్టు |
| 135 | 2 | క్రాక్షండా | కాక్షుండా |
| 146 | 16 | క్వాంమ్యామవాబ | క్వాంమూమవాద |
| 146 | 19 | సఖ్యా | సహ్యా |
| 146 | 20 | అసఖ్యా | అసహ్యా |

ఇంకా అక్షరములుండి స్పష్టముగా ప్రింటుగానివి- అక్షరలముల స్వల్పలోపములు రసజ్ఞులైన పాఠకులు గ్రహింప ప్రార్థితులు.